Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు | స్థాపితం: 1930 | జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

Longest Living Newspaper in Telugu Journalism

# జమీన్‌రైతు

సంపుటి: 82 • సంచిక: 47 • 25-11-2011 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-

జమీన్‌రైతు
పొగతోట, నెల్లూరు - 524 001
ఫోన్: 0861 - 2327354
సెల్: 98489 66190
జీవిత చందా రూ.1000లు
సంవత్సర చందా
స్వదేశంలో రూ.200లు
విదేశాలకు రూ.1000లు



# జగన్ దెబ్బకు బోల్తాకొట్టిన చంద్రబాబు!

## • తన కళ్లు పొడిచిన హైకోర్టు వేలితోనే బాబు కళ్లూ పొడిచాడు

జగన్‌కు రాజకీయ పరిపక్వత లేదని, ఈనాటి రాజకీయాలకు పనికిరాడని, ఆయన పంథా మార్చుకోకుంటే వైఎస్ఆర్ కాంగ్రెస్‌కు భవిష్యత్తు ఉండదని ప్రకటించాడు, జగన్ అభిమాన ఎమ్మెల్యే బృందంలో ముఖ్యాతి ముఖ్యుడైన జమ్మలమడుగు ఆదినారాయణరెడ్డి. అయితే చంద్రబాబు బృందం మీద సిబిఐ విచారణకు హైకోర్టు ఆదేశం రప్పించడం ద్వారా తానెంత గొప్ప రాజకీయ మేధావినో నిరూపించుకొన్నాడు వైఎస్ జగన్. రాజకీయాలలో తనను తాను కాపాడుకోవడానికి, శత్రువులను అణిచి పెట్టడానికి ఎటువంటి వ్యూహాలు పన్నవచ్చో జగన్‌ను చూసి నేర్చుకోవలసిన పరిస్థితి ఏర్పడింది ఇప్పుడు.

చంద్రబాబు అక్రమ ఆస్తుల మీద దర్యాప్తు జరిపించమని వైఎస్ విజయమ్మ వేసిన పిటిషన్, తెలుగుదేశం పార్టీకి పట్టపగలే చుక్కలు చూపిస్తున్నది. విజయమ్మ వేసిన పిటిషన్ నామమాత్రమైంది. అందులో చంద్రబాబు అవినీతిని, అక్రమ ఆస్తులను నిరూపించగల్గిన ఆధారాలు ఒక్కటీ లేవు. దాదాపుగా అన్నీ ఊహాజనితాలు. జగన్ విషయంలో శంకరరావు వేసిన పిటిషన్‌కు దీనికి చాలా తేడా ఉంది. పలు పత్రికలు, ప్రతిపక్షాలు కలిసి సేకరించిన జగన్ అక్రమ ఆస్తులు, భారీ నగదు లావాదేవీలు, నకిలీ కంపెనీల సృష్టి వంటి వాటికి సంబంధించిన చట్టపరమైన ఆధారాలను క్రోడీకరించి హైకోర్టుకు లేఖ వ్రాశాడు శంకరరావు. ఆ పిటిషన్ జగన్ అక్రమాలకు ప్రాథమిక ఆధారం వంటిది. అటువంటి సమాచారం ఏదీ లేకపోయినప్పటికీ వైఎస్ విజయమ్మ పిటిషన్ కూడా హైకోర్టు ఆమోదం పొందింది. దీనివల్ల తమకు వచ్చే నష్టం ఏదీ లేదని తన మీద వచ్చిన ఆరోపణల మీద వైఎస్ రాజశేఖర్‌రెడ్డి బ్రతికి ఉన్నప్పుడు పదుల సంఖ్యలో కేసులు, విచారణలు జరిపినా ఏదీ రుజువు చేయలేకపోయాడు కాబట్టి సిబిఐ కూడా అంతకంటే సాధించేది ఏదీ ఉండదని తాను నిర్దోషిగా, నిష్కళంకుడిగా బయటపడతానని ధీమాతో ఉండినాడు చంద్రబాబు.

కానీ ఇప్పుడు పరిస్థితి అట్లా లేదు. హైకోర్టు ఆదేశం ద్వారా జగన్ అవినీతి రుజువైందని ఇంత కాలం పత్రికలు, తెలుగుదేశం వంటి ప్రతిపక్షాలు గోల చేస్తున్నాయి. జనంలో ఈ అంశాన్ని సజీవ చర్చగా కొనసాగిస్తున్నాయి. అయితే ఇప్పుడు ఆ

కొరవ 14వ పేజీలో

# కోవూరు బలిపీఠంపై సోమిరెడ్డి!

కోవూరు ఉపఎన్నికల ప్రయత్నాలు ముమ్మరంగా వున్నాయి. నల్లపరెడ్డి ప్రసన్న కుమార్‌రెడ్డి రాజీనామాతో ఏర్పడిన ఖాళీని పూరించడానికి వచ్చే మే నెల లోపల ఎన్నికలు జరుగుతాయి. అది ఎప్పుడైనా కావచ్చు. ఎన్నికల కమిషన్ ఇష్టం. మార్చి, ఏప్రెల్, నెలలలో కొన్ని రాష్ట్రాల సాధారణ ఎన్నికలు వున్నాయి కాబట్టి, ఆ ప్రాంతంలోనే దీనిని కూడా జరిపించవచ్చునని అంచనా. ఎన్నికలకు అంత దూరం వుండదని తెలిసినా వైఎస్ఆర్ కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలు మాత్రం ఇప్పటి నుంచే గోదాలోకి దిగిపోయాయి. వైఎస్ఆర్ కాంగ్రెస్‌కు అభ్యర్థి వివాదం లేదు. తన రాజీనామాతో ఏర్పడిన ఖాళీ కాబట్టి, తనే అభ్యర్థి అవుతాడు ప్రసన్న కుమార్‌రెడ్డి.

తెలుగుదేశం పార్టీకి కొంత సమస్య వచ్చింది. ఆ పార్టీకి ఇది ప్రతిష్ఠాకరమైన ఎన్నిక. జగన్ ప్రభావం వల్ల తెలుగుదేశం పార్టీ ప్రజలలో అదృశ్యమై పోతుందన్న ప్రచారం వుంది. 2014 సాధారణ ఎన్నికల లోపల బహుశా ఇదే చివరి ఎన్నిక కావచ్చు. అందువల్ల ప్రజలలో తెలుగుదేశం పార్టీ పరిస్థితి ఏమిటో నిరూపించే

కొరవ 14వ పేజీలో

# మాయాజాలం

దేశ రాజకీయాలలో ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రి మాయావతిది ఒక ప్రత్యేక శైలి. ఆమె వేసే ప్రతి అడుగు, తీసుకొనే ప్రతి నిర్ణయమూ విచిత్రంగా కన్పడతాయి. రాజకీయాలలో కులమనే అస్త్రాన్ని ప్రయోగించడంలో ఆమెకు సాటి రాగల వారు మరెవరూ లేరు. అందువల్లనే ఉత్తరప్రదేశ్ ప్రజలకు, రాష్ట్రానికి ఆమె చేసిన ఉపకారం ఏమీ లేకపోయినా ఒకటికి నాలుగుసార్లు ముఖ్యమంత్రి కాగలిగారు. మళ్లీ మరొకసారి ఆ ఉన్నత పీఠం అధిరోహించడానికి ఎంతో తెలివిగా పన్నిన పన్నాగమే ఉత్తరప్రదేశ్‌ను నాలుగు రాష్ట్రాలుగా విభజించాలన్న ప్రతిపాదన.

ఉత్తరప్రదేశ్ విశాలమైన రాష్ట్రం. 20 కోట్ల మంది ప్రజలు నివసించే ప్రాంతం. గంగా, యమున వంటి జీవ నదులతో సహా దాదాపు 32 పెద్ద నదులు ప్రవహిస్తున్నాయక్కడ. కొన్ని వేల కిలోమీటర్ల పరిధిలో విస్తరించిన గంగా పరీవాహక ప్రాంతం దేశంలోని అత్యంత సంపన్నమైన వ్యవసాయిక విభాగాలలో మొదటిది. అన్ని మతాలకూ అదొక పుణ్యస్థలి. భారత జాతి చరిత్రను మలుపు తిప్పిన ప్రతి చక్రవర్తీ ఈ ప్రాంతం నుంచి పాలన కొనసాగించినవాడే. ఆధునిక స్వతంత్ర భారత చరిత్రలో కూడా దేశానికి ఎందరో ప్రధానులను అందించిన రాష్ట్రం. జవహర్‌లాల్ నెహ్రూ, లాల్ బహదూర్ శాస్త్రి, ఇందిరమ్మ, రాజీవ్‌గాంధీ, విపి.సింగ్, చరణ్‌సింగ్, చంద్రశేఖర్, అటల్ బిహారీ వాజ్‌పాయిలు ఉత్తరప్రదేశ్ నుంచి లోక్‌సభకు ఎన్నికై ప్రధానులుగా పీఠమెక్కారు. దేశ జాతీయోత్పత్తిలో దాదాపు 9శాతం ఉత్తరప్రదేశ్ నుంచి అందుతున్నది. పార్లమెంట్‌కు 85 మంది ఎమ్పీలను పంపుతున్న అతి పెద్ద రాష్ట్రమది.

జమీన్‌రైతు

భిన్న జాతులు, మతాలు, సంస్కృతులు, ఆచారాలు, అలవాట్లు, భౌగోళిక పరిస్థితులు కల్గిన రెండున్నర లక్షల కిలోమీటర్ల సువిశాల ప్రాంతాన్ని ఒక్క కేంద్రం నుంచి పాలించడం సబబు కాదనే వాదన చాలా కాలం నుంచి వుంది. కానీ దేశ రాజకీయాలకు గుండె కాయ వంటి రాష్ట్రాన్ని ముక్కలు చేసే సాహసం ఎవరూ చేయలేక పోయారింత కాలం. పదేళ్ల క్రితం ఉత్తరాఖండ్ వేర్పాటు జరిపింది బిజెపి సర్కారు. అప్పుడే తమకూ స్వయం పాలన కావాలని తతిమా ప్రాంతాల వారు నినదించారు. కానీ ఎవరూ విన్పించుకోలేదు. ఇప్పుడా పుణ్యం మూట కట్టుకోవడానికి ముందుకొచ్చింది మాయావతి.

ఉత్తరప్రదేశ్ శాసనసభకు 2012లో ఎన్నికలు జరగబోతున్నాయి. దళిత ఆత్మగౌరవానికి ప్రతీకగా రాజకీయాలు నెరపే మాయావతి, గత ఎన్నికలలో విచిత్రంగా బ్రాహ్మణ కులస్తుల గౌరవాన్ని తాను కాపాడుతాననే నినాదం లేవనెత్తి, ఆ ఎన్నికలలో ప్రతిపక్షాలను చిత్తు చేశారు. వచ్చే ఎన్నికలకు ఆ మంత్రం పని చేసేట్లు కన్పించడం లేదు. దానితో, రాష్ట్రాన్ని నాలుగు ముక్కలు చేసే ప్రతిపాదన ముందుకు తెచ్చి, ప్రతిపక్షాలను ఇరకాటంలో పెట్టారు. ప్రజలలో రాష్ట్ర విభజన పట్ల వున్న ఆసక్తి దృష్ట్యా ఏ పార్టీ కూడా ఈ ప్రతిపాదనను బహిరంగంగా వ్యతిరేకించలేకున్నాయి. అట్లని మాయావతి చేతుల మీదుగా ఈ ప్రతిపాదన ముందుకు రావడం వారికి ఇష్టం లేదు. దానివల్ల ఆమెకు రాజకీయ లబ్ధి దొరుకుతుందన్నది వారి భయం. కానీ మాయావతి వారి అభ్యంతరాలను లెక్క చేయకుండా, శాసనసభలో ఎంత గోల జరుగుతున్నప్పటికీ పట్టించుకోకుండా, కేవలం 25 సెకండ్లలో రాష్ట్ర విభజన తీర్మానాన్ని ప్రవేశపెట్టి, ఆమోద ముద్ర వేయించేశారు. ఇది అన్యాయం, అప్రజాస్వామికమని ఎవరెంత గోల చేసినా ఆమె పట్టించుకోలేదు.

స్వాతంత్ర్యం వచ్చిన కొత్తల్లో భాష ఆధారంగా రాష్ట్రాల ఏర్పాటు జరగాలనే ప్రతిపాదన ఆచరణకు వచ్చింది. ఇప్పుడు కాలం మారింది. పరిపాలనా సౌలభ్యాన్ని అనుసరించి రాష్ట్రాల విస్తీర్ణం వుండాలనే వాదన బలంగా విన్పిస్తున్నది. చిన్న రాష్ట్రాల వల్ల పరిపాలన ప్రజలకు మరింత చేరువ అవుతుందనే భావన దీనికి ప్రాతిపదిక. ఛత్తీస్‌ఘడ్, ఉత్తరాఖండ్, జార్ఖండ్ రాష్ట్రాల ఆర్థిక పురోగతి అందుకు ఒక ఉదాహరణ. అయితే అదే సమయంలో రాష్ట్రాలు చిన్నవైతే రాజకీయంగా బలహీనపడి నక్సలైట్ల వంటి తీవ్రవాద ఉద్యమాలు పెరిగి పోతాయన్న భయం కూడా వుంది. ఆ కారణంతోనే తెలంగాణ ఉద్యమాన్ని పక్కన పెడుతున్నది కేంద్ర ప్రభుత్వం. ఇప్పుడు ఉత్తరప్రదేశ్‌ను పూర్వాంచల్, బుందేల్‌ఖండ్, అవధ్‌ప్రదేశ్, పశ్చిమప్రదేశ్‌లుగా చీల్చాలన్నది మాయావతి ప్రతిపాదన. దీనిపై ఒక నిర్ణయానికి రావాలంటే, రెండవ రాష్ట్రాల పునర్విభజన కమిషన్ ఏర్పాటు ఒకటే మార్గం. ఆ సంఘాన్ని ఏర్పాటు చేసి, విస్తృత స్థాయి చర్చ జరిపి, దేశంలో ఎన్ని కొత్త రాష్ట్రాలు రావాలో సత్వరం నిర్ణయం తీసుకోవడం శ్రేయస్కరం.

## జనవాణి

### పనికి మాలిన పథకం

నవంబర్ 1తేది నుంచి రాష్ట్ర ప్రభుత్వం రూపాయికి కిలో బియ్యం పథకాన్ని ప్రారంభించింది. ఈ పథకం వల్ల రాష్ట్ర ప్రజలకు ఆకలి దప్పులు తీరిపోయినట్లు ముఖ్యమంత్రి కిరణ్ కుమార్‌రెడ్డి ఊదరగొడుతున్నారు. రేషన్ షాపుల్లో ఎప్పుడిస్తారో తెలియని ఈ ముక్కిపోయిన బియ్యం కోసం ఎగబడే వారు లేరు. నిత్యావసర వస్తువులైన పప్పులు, నూనె, చింతపండు, మిరపకాయల ధరలు మండిపోతుంటే ప్రభుత్వం బియ్యం పథకంలో తెల్లకార్డు వున్న కుటుంబంలో ఒక వ్యక్తికి నాలుగు రూపాయలు సబ్సిడీ ఇస్తూ అదేదో గొప్ప పనని అభివర్ణించుకోవడం తగనుగాక తగదు. ఇప్పటికైనా ప్రభుత్వ పెద్దలు కాస్త కలదెలుసుకొని నిత్యావసర వస్తువుల ధరల తగ్గింపుపై దృష్టి పెట్టాలి. తెల్ల రేషన్ కార్డున్న ప్రతి కుటుంబానికి వ్యక్తుల సంఖ్యను బట్టి నాణ్యమైన బియ్యం నెలకు 15కిలోల వంతున రెండు రూపాయలకు పంపిణీ చేస్తే కొంతవరకైనా ఆహార భద్రత ఏర్పడుతుంది.

*గద్దం తిరిపాలురెడ్డి* — *మహమ్మదాపురం*

### ఇంజనీర్లా... ప్యాకర్లా!

గత మార్చి నెలలో జరిగిన పదవ తరగతి పరీక్షా ఫలితాల్లో అత్యధిక మార్కులతో పాసైన విద్యార్థినీ, విద్యార్థులకు బాసరలో సరస్వతీ దేవాలయం నుంచి ప్రసాదం పంపాలని దేవస్థానం పాలక వర్గం నిర్ణయించింది. ఈ పని చేసేందుకు బాసరలోని ట్రిబుల్ ఐటిలో ఇంజనీరింగ్ చదువుతున్న విద్యార్థులను ఉపయోగించడం దారుణం. ఈ ప్రసాదంలో ఆడపిల్లలకు లంగా ఓణీ, మగపిల్లలకు బట్టలు, తీను బండారాలున్నాయి. భావిభారత ఇంజనీర్లను ప్యాకర్లు చేసిన వారిపై ప్రభుత్వం తగిన చర్యలు తీసుకోవాలి.

*ప్రొఫెసర్ కె.నాగరాజారావు* — *హైదరాబాద్*

### జ్వరాలను అరికట్టలేరా?

రాష్ట్రంలో డెంగ్యూ, మలేరియా, టైఫాయిడ్ జ్వరాలు విజృంభించి వున్నాయి. వేలాది మంది అనారోగ్యం పాలవుతుండగా సరైన సమయంలో నాణ్యమైన వైద్యం అందక అమాయకులు, పేదలు మృత్యువాత పడుతున్నారు. పట్టణాలలోని కార్పొరేట్ ఆస్పత్రులు రోగుల నుండి అందినంత దోచుకుంటుండగా గ్రామీణ ప్రాంతాలలోని ప్రభుత్వ వైద్యశాలల్లో డాక్టర్ల కొరత, మందులు అందుబాటులో లేకపోవడం, సిబ్బంది నిర్లక్ష్యం వంటి కారణాల వల్ల పేదలకు వైద్యం అందడం లేదు. ఇటీవల కొత్తగా వెలుగుచూసిన హంటా వైరస్ త్వరితగతిన వ్యాప్తి చెందే అవకాశముందని వైద్య నిపుణులు హెచ్చరికలు జారీ చేస్తున్నారు. ఇటువంటి ప్రమాదకరమైన వ్యాధులను సమర్థవంతంగా ఎదుర్కొనేందుకు ప్రభుత్వం తక్షణం అప్రమత్తం కావాలి.

*పి.సామ్యేల్* — *కావలి*

## 70 ఏళ్ల క్రితం ఈవారం

**28-11-1941**
**పేజీలు : 10 వెల: అణా**

### నెల్లూరు ముచ్చట్లు

హిందూ, మహమ్మదీయ సంఘర్షణలో ఇండ్లు, వాకిండ్లు కోల్పోయి నష్టపడ్డ వ్యక్తులకు సాయపడుటకు కాంగ్రెస్ పక్షాన ప్రకాశం పంతులు రిలీఫ్ కమిటీని నియమించారు. దీనిలో హిందూ, మహమ్మదీయులు బేధాలు పెట్టుకోకూడదనే మా యభిప్రాయం. యుద్ధంలో దెబ్బలు తిన్నవారికి చికిత్స చేయుటలో స్వపక్ష, పరపక్ష బేధాలు లేవు. మనము ఇచ్చిన రెడ్‌క్రాస్ ఫండుతో ఎన్నో భారతీయ ప్రాణాలను దిగమ్రింగిన ఎందరో జర్మన్, ఇటలీ సైనిక క్షతగాత్రులు చికిత్స పొందుతున్నారు. కావున బేధాలు మరచి ఎల్లరు విరివిగా సహాయపడి మానవధర్మాన్ని నిలబెట్టాలి.

### హిందువులకు విజ్ఞప్తి!

26వ తేదీ జరిగిన మహమ్మదీయ కానిస్టేబుల్‌ను పొడిచిన దురంతాన్ని మేము గర్హిస్తున్నాము. దుండగీండ్రు అనే వారికి కూడా మెదడు, ఒక ఆలోచన, ప్రోగ్రాము ఉంటుంది. ఈ కార్యం జరిపిన వారికి అవేమీ ఉన్నట్లు లేదు.

గత కలెక్టరు పక్షపాతం చేశాడని అంటారు. వారికి బదులు మరొకరు వచ్చారు. వీరికి హిందువుల బుద్ధిమంతుని తనమేమిటో మహమ్మదీయుల దుండగములేమిటో తెలపొద్దా? ఈయన కాశంతో ఆయన కాశం పోయింది గదా? అందువల్ల హిందువులకు మా సలహా ఏమిటంటే ఇతర పక్షం వారు దుండగాలు జరిపితే మీరు భరించండి. అంతేకాని మీరు ప్రతిక్రియ చేయవద్దు. అట్టిదాన్ని కలెక్టరుకు ఎత్తి చూపండి. అప్పుడు నీయందు కనికరం, పరాయి పక్షం మీద దురభిప్రాయం ఏర్పడుతుంది. అప్పుడు పరాయి పక్షం వారు తగిన శాస్తి అనుభవిస్తారు. నీవు శాంతం వహించు! ఓర్చుకో. అధికారిని విరోధం చేసుకోవద్దు జాగ్రత్త!

## 50 ఏళ్ల క్రితం ఈవారం

**24-11-1961**
**పేజీలు: 12 వెల: 0-20 న.పై**

### కావలి కాల్వ

కావలి కాల్వకు శంకుస్థాపన జరిగింది. నలభై ఏండ్ల ఆందోళన కార్యోన్ముఖమైనందుకు ఆనందించని నెల్లూరు మండలీయుడు, ముఖ్యంగా ఈ కాలువ ప్రయోజనాన్ని పొందే కోవూరు, కావలి రైతు వుండడు. అది వాస్తవంగా సుదినమే.

తొమ్మిది మాసాల క్రితం ఈ కవల కాల్వలలో ఒకటైన కనుపూరుకు శంకుస్థాపన జరిగి, పని సాగుతున్నది. ఆనాడు కావలి కాల్వకు శంకుస్థాపన జరగకుండడం, కావలి రైతాంగాన్ని క్రోధావేశాలను గావించింది. కావలి కాల్వ గూడా మూడవ ప్రణాళికలో చేర్చబడగలదని, అది నిరాదరింపబడదని ఎవరు ఎన్ని చెప్పినా వారికి సంతృప్తిని కూర్చలేదు. కడకు డాక్టర్ గోపాలరెడ్డి మొదటి రోజు చెప్పినట్లు ఈ కవలలలో కనుపూరు పుట్టిన కొద్ది కాలానికి, కావలి కాల్వ జననం తప్పలేదు. ఈనాడు వారి మాట యదార్థమని రుజువైనందుకు సంతోషిస్తూ, మాట నిలబెట్టుకున్నందుకు వారిని అభినందిస్తున్నాము.

మే నెలలోనే కావలి కాల్వకు శంకుస్థాపన చేయగలమని ముఖ్యమంత్రి సంజీవయ్య, పబ్లిక్ వర్క్సు శాఖామాత్యులు సత్యనారాయణరాజు గారలు ఫిబ్రవరిలో కావలి బహిరంగ సభలో ప్రకటించారు. కానీ ఆరు నెలలు ఆలస్యమైనది. ప్రణాళికలో భాగమైన కావలి, కనుపూరు కాల్వల నిర్మాణం ఇక నిరాఘాటకంగా, నిర్విఘ్నంగా కొనసాగగలదని ఆశించవచ్చు. ఈ సత్కృషికి పేర్లతో వ్యక్తులను అభినందించడం కంటే గోపాలరెడ్డి గారు పేర్కొన్నట్లు ఇది ప్రజా విజయంగా పరిగణించడం సముచితంగా, వివాదరహితంగా వుంటుంది.

*జ.రై సంపాదకీయం నుంచి*

# నెల్లూరు ముచ్చట్లు

## మంచు కురుస్తుంది!

నవంబరు నెలలో జిల్లాలో వర్షం పడడం రివాజు. ఈ యేడాది ఆ రివాజు మారింది. గతవారం రోజులుగా సాయంత్రం ఆరు గంటల నుంచే మంచు కురుస్తుంది. చలి కూడా గజగజలాడిస్తుంది. ఈశాన్య రుతుపవనాల మూలంగా జిల్లాలో నవంబరు నెల మొదలు పెట్టి డిశంబరు మొదటివారం వరకు వర్షం పడడం జరుగుతుంది. మంచు మొదలైన దృష్ట్యా ఇంక వర్షం గూర్చి మరచిపోవాల్సిందే. మొత్తంమీద ఈ ఏడాది సీజన్‌లో కేవలం 15 రోజులు మాత్రమే జిల్లాలో వర్షం పడింది.

## రిత్విక్ ప్రాజెక్ట్ వ్యాపారం

చంద్రబాబుతోపాటు మరికొందరి ఆస్తులపై సిబిఐ విచారణ జరపమని హైకోర్టు ఆదేశించిన జాబితాలో రిత్విక్స్ ప్రాజెక్ట్ అధినేత సిఎం రమేష్ పేరుంది. కానీ సిఎం రమేష్ మాత్రం తాను చంద్రబాబు హయాంలో పొందిన మేళ్లు లేవని గట్టిగా చెబుతున్నాడు. నెల్లూరు ట్రంకు రోడుపై అత్యంత విలువైన స్పిన్నింగ్ మిల్ ఆస్తులను చాలా తక్కువ ధరకు బాబు సహకారంతో రిత్విక్ ప్రాజెక్ట్స్ పొంది ఆ స్థలాన్ని రిత్విక్ ఎన్‌క్లేవ్ పేరిట రియల్ ఎస్టేట్ వ్యాపారం చేసిన విషయం నెల్లూరీయులకు ఇంకా గుర్తుంది రమేష్‌జీ.

## ప్రజావైద్యశాలలోనూ ఫీజులు పెరిగాయి!

నెల్లూరు శంకర అగ్రహారంలోని డాక్టర్ రామచంద్రారెడ్డి ప్రజావైద్యశాలలోనూ ఫీజులు బాగా పెరిగాయి. గతంలో ఐదు రూపాయలుండిన సాధారణ సంప్రదింపుల ఫీజు గరిష్టంగా 40 రూపాయలయ్యింది. రక్త, మల, మూత్ర పరీక్షల ఫీజులతోపాటు ఎక్స్‌రే, స్కానింగ్, ఆపరేషన్ల ఫీజులు పెరిగిపోయాయి. స్వర్గీయ డాక్టర్ రామచంద్రారెడ్డి పేద ప్రజలకు వైద్యం అందుబాటులో ఉండాలని ఏర్పాటుచేసిన ఆసుపత్రిని కమర్షియల్ ప్రాతిపదికన ఇప్పుడున్న కమిటీ నడపాలని నిశ్చయించినట్లుంది.

## ప్రజాసేవా కేంద్రంలో పిల్లలు

నెల్లూరు ఎమ్మార్వో కార్యాలయంలో విద్యార్థులకు అవసరమైన ఆదాయ, కుల, స్థిర నివాస సర్టిఫికేట్లు త్వరితగతిన ఇచ్చేందుకు ఏర్పాటుచేసిన ప్రజాసేవా కేంద్రంలో కంప్యూటర్ ఆపరేటర్ల పేరిట విషయం తెలియని పిల్లలు పనిచేస్తున్నారు. వేగంగా సర్టిఫికేట్ల మంజూరీకి వీళ్లను ఏర్పాటుచేసినా వీటి మంజూరీకి వీళ్లు సైతం రెవిన్యూ సిబ్బందిలా చిల్లర అడగడం విస్తుపోయేలా చేస్తుంది. ఈ – సేవా కేంద్రంలో అప్పటికప్పుడు ఆదాయపు సర్టిఫికేట్లు ఇచ్చేస్తున్నా మిగతా సర్టిఫికేట్ల జారీకి రెండు రోజుల సమయం తీసుకొంటున్నారు. ఇక్కడిస్తున్న సర్టిఫికేట్లపై సంతకాలు పెట్టను ప్రత్యేకంగా ఒక ఎమ్మార్వోను నియమించడం అభినందనీయం.

## స్టూడెంట్స్ అకౌంట్స్‌పై శ్రద్ధచూపని బ్యాంకులు!

ఇంటర్ నుంచి ఉన్నత విద్యను చదివే విద్యార్థులకు ప్రభుత్వం రకరకాల స్కాలర్‌షిప్పులు మంజూరు చేస్తుంది. వీటి మంజూరీకి ప్రతి విద్యార్థికి ఓ బ్యాంకు అకౌంట్ తప్పనిసరి. ఏ బ్యాంకులోనైనా అకౌంట్స్ ప్రారంభించుకోవచ్చని ప్రభుత్వం ఆదేశాలు జారీచేసినా ఎస్‌బిఐ, ఎస్‌బిహెచ్, మినహా మిగతా బ్యాంకులు పిల్లల అకౌంట్లు తెరవను సవతి తల్లి ప్రేమ చూపిస్తున్నాయి. ఆంధ్ర బ్యాంకు అయితే మరీ నియంతలా వ్యవహరిస్తుంది. అకౌంట్ హోల్డర్లంతా లక్షలు, కోట్లు జమచేయలేరు. ప్రజల డబ్బుతో వ్యాపారం చేసి లాభాలార్జించే బ్యాంకులు వారి పిల్లల అకౌంట్లు తెరవను ఆచరణీయం కాని రూల్స్ చెప్పడం దారుణం. ఈ వ్యవహారంలో నెల్లూరు బ్యాంకర్ల తీరుపై కలెక్టర్ సమీక్ష చేయాల్సిన అవసరం ఉంది.

## జకీర్‌కు కాంగ్రెస్ మైనార్టీ సెల్ పగ్గాలు!

నెల్లూరు జెండావీధి యువకుడు జకీర్‌కు కాంగ్రెస్ పార్టీ మైనార్టీ సెల్ జిల్లా అధ్యక్షుడి బాధ్యతలను రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి అప్పజెప్పారు. జకీర్ మాజీ కార్పొరేటర్ జరీనా సుల్తానా తమ్ముడు. డిష్ ఆపరేటర్‌గా నాలుగు రూకలు వెనుకవేసిన వ్యక్తి. వివేకా అంటే ఏమంత భక్తిప్రపత్తులు లేనివాడు జకీర్. ఆయనను ఈ పదవి వరించడమే ఇప్పుడు చర్చనీయాంశమైంది.

## దోచేస్తున్న అంబులెన్స్‌లు!

అవసరాన్ని డబ్బు చేసుకోవడమే ధ్యేయంగా నెల్లూరులోని అంబులెన్స్ నిర్వాహకులు నడుస్తున్నారు. అత్యవసర పరిస్థితుల్లో నగరంలోని రోగులను ఇక్కడి ఆసుపత్రులకు తరలించను వెయ్యి నుంచి పదిహేను వందల రూపాయలు అడుగుతున్నారు. చనిపోయిన వ్యక్తుల శవాలను తరలించను 2500 రూపాయలు డిమాండ్ చేస్తున్నారు. బయట ప్రాంతాలకు దూరాన్ని బట్టి వేల రూపాయలు అడుగుతున్నారు. సామాన్య, మధ్య తరగతీయులు ఈ రేట్లను తట్టుకోలేక గుండెలు బాదుకొంటున్నారు. అంబులెన్స్‌ల ఓనర్లు కాస్త మానవీయం ప్రదర్శిస్తే బాగుంటుంది.

## ఆదివారం కూడా విచారణలు!

సహజంగా సిబిసిఐడి విభాగంలోని పోలీసులు జీతాలు తీసుకోను 1వ తేది ఆఫీసుకు రావడం మినహా పెద్ద పని ఉండేది కాదు. మనీ సర్క్యులేషన్ స్కీం విచారణ బాధ్యతలు స్వీకరించాక ఆ విభాగంలోని సిబ్బందికి అరవ చాకిరి చేయకతప్పడం లేదు. ఉదయం నుంచి అర్ధరాత్రి వరకు బాధ్యతలు నిర్వహిస్తున్నా ఇప్పటివరకు బాధితుల పేర్లన్నీ రికార్డు చేయలేకపోయారు. డిఎస్పీ విజయకుమార్ అయితే రోజంతా రకరకాల విచారణలు, రికార్డుల పరిశీలనతోపాటు ఆదివారం కూడా విధులు నిర్వహిస్తూ కనపడుతున్నారు.

### చందాదారులకు మనవి

- **చందా పంపించేటప్పుడు తమ చందా నెంబరు, పూర్తి పేరు, చిరునామా తెలియపరచండి.**
- **మీ చందా నెంబరు, చందా ఏ తేదికి అయిపోతుందో, అడ్రసు రేపరు మీదనే ముద్రించి వుంటుంది.**
- **'జమీన్‌రైతు' చందాదార్లు తమ చందాను ఎం.ఓ/డి.డి లేదా Online‌లో ఆంధ్రాబ్యాంక్, విఆర్‌కాలేజి బ్రాంచి, నెల్లూరు అకౌంట్ నెంబర్: 106811011000423లో ZAMINRYOT పేరుతో జమచేయవచ్చు. సకాలంలో చందా చెల్లించవలసినదిగా కోరుతున్నాము.**
- **చెక్కులు స్వీకరించబడవు.**

**జీవిత చందా రూ.1000/-**

**సంవత్సర చందా**

స్వదేశంలో రూ.200/-
విదేశాలకు రూ.1000/-

**జమీన్‌రైతు**
**పొగతోట, నెల్లూరు - 524 001**
**ఫోన్: 0861 - 2327354**
**సెల్: 98489 66190**

## డిఎస్పీల బదలీలు

గూడూరు ఓఎస్‌డి, కావలి డిఎస్పీలుగా పనిచేస్తుండిన నారాయణరెడ్డి, శ్రీనివాసరెడ్డిలను ప్రభుత్వం బదలీ చేసింది. వీరి స్థానంలో ట్రైనింగ్ పూర్తి చేసుకొన్న సురేష్‌కుమార్, ఇందిరలను నియమించింది. కావలిలో ట్రైనీ డిఎస్పీగా పనిచేస్తుండిన హైమావతికి మహబూబ్ నగర్‌లో పోస్టింగ్ ఇచ్చింది.

ఇది ఇలా ఉండగా నెల్లూరు నగర సిఐ వీరాంజనేయరెడ్డి, రూరల్ సిఐ జయరామసుబ్బారెడ్డిలకు డిఎస్పీలుగా ప్రమోషన్ రానుంది. వారం రోజుల్లో నెల్లూరులోని టు, త్రీ, ఫోర్త్, ఫిఫ్త్‌టౌన్ పోలీస్ స్టేషన్లకు కొత్త ఎస్‌ఐలు రాబోతున్నారు.



**గూడూరులో గడప గడపకు వైఎస్‌ఆర్ కాంగ్రెస్ పార్టీ కార్యక్రమంలో భాగంగా ప్రజలను కలుస్తున్న ఆ పార్టీ నాయకుడు బత్తిని విజయకుమార్.**

## శబరిమలైకు సిటీ ఎమ్మెల్యే!

నెల్లూరు సిటీ ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి 20వ తేది శబరిమలైకు బయలుదేరి వెళ్లారు. గత 29 ఏళ్లుగా ఆయన నిరాటంకంగా అయ్యప్ప స్వామి మాలధారణ చేస్తున్నారు.

## కోతవేళ మారింది

విద్యుత్ శాఖాధికారులు జనంతో ఆటలాడుతున్నారు. ఈ వారం నుంచి నగరంలో విద్యుత్ కోత వేళలు మళ్లీ మార్చారు. ఉదయం ఏడు గంటల నుంచి తొమ్మిది గంటల వరకు, మధ్యాహ్నం ఒంటి గంట నుంచి మూడు గంటల వరకు కోత విధిస్తున్నారు. ఈ కోతల వాతలు ఎన్నాళ్లనేది చెప్పడం లేదు.

## జిల్లాకు బహుమతి

20 సూత్రాల అమలు కార్యక్రమంలో రాష్ట్రంలో జిల్లా మూడవ స్థానంలో నిలిచింది. దీనికిగాను మూడు లక్షల రూపాయల బహుమతి, ప్రశంసా పత్రాన్ని ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి నుంచి హైదరాబాద్‌లో జరిగిన ప్రత్యేక కార్యక్రమంలో జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి అందుకొన్నారు.

## ఏడుకొండల వాడికీ సాధ్యం కాదట!

భక్తజనకోటి ఆరాధ్య దైవం ఏడుకొండల స్వామి కల్పించుకొన్నా దేశంలో పెచ్చుపెరిగిపోతున్న నిత్యావసర వస్తువుల ధరలు తగ్గించలేరని తిరుపతి ఎమ్పీ చింతా మోహన్ ప్రకటించారు. నాయుడుపేటలో రచ్చబండ కార్యక్రమంలో పాల్గొన్న ఆయన మాట్లాడుతూ భారతదేశ ఆర్థిక వ్యవస్థ పాత ప్రధాని పివి నరసింహారావు, ఇప్పటి ప్రధాని మన్మోహన్‌సింగ్ తీసుకొన్న నిర్ణయాల వల్ల గట్టిగా ఉందన్నారు. అంతర్జాతీయంగా ఏర్పడుతున్న సంక్షోభాల వల్ల పెట్రోల్, డీజిల్ ధరలు తగ్గితేనే నిత్యావసర వస్తువుల ధరలు తగ్గుతాయని ఈ డాక్టర్ పెద్ద పరిశోధన చేసినట్లు చెప్పుకొచ్చారు.

## అదనపు డిఎంహెచ్‌ఓకు అనారోగ్యం

అదనపు జిల్లా వైద్య ఆరోగ్య శాఖాధికారి దశరథరామయ్య అనారోగ్యానికి గురయ్యారు. క్యాంపస్‌కు వెళ్లి వస్తూ ఒక్కసారిగా కుప్పకూలిపోవడంతో డిఎంహెచ్‌ఓ మాశిలామణి తదితరులు

కొరవ 14వ పేజీలో

# దుస్థితిలో పెద్దాసుపత్రి పోస్ట్‌మార్టం గది!

**● తక్షణం కొత్త గదిని నిర్మించాలి**



నేలపైనే పోస్టుమార్టం.

నెల్లూరులోని పెద్దాసుపత్రిలో 250 పడకలున్నాయి. ట్రామాకేర్ సెంటర్, రక్తనిధి, అత్యాధునిక వైద్య సదుపాయాలతో అత్యవసర వైద్య విభాగం ఉంది. హాస్పిటల్‌లో చేరి చికిత్స పొందుతూ నిత్యం ఒకరిద్దరు చనిపోతారు. తూర్పున ముత్తుకూరు, పడమర జొన్నవాడ, దక్షిణాన వెంకటాచలం, ఉత్తరాన పెన్నానది బ్రిడ్జి సరిహద్దుల్లో ఏ ఆత్మహత్య, రోడ్డు ప్రమాదాలు, అనుమానాస్పద పరిస్థితులలో మరణించిన వారిని నెల్లూరు పెద్దాసుపత్రికే పోస్టుమార్టమ్‌కు తరలిస్తారు. వాస్తవం చెప్పాలంటే నిత్యం పెద్దాసుపత్రి శవాలతో కళకళలాడుతుంటుంది. మిగతా అన్ని విభాగాల్లో ఎన్నో సౌకర్యాలున్నా అతి ముఖ్యమైన పోస్టుమార్టమ్ నిర్వహించే గదిలో శవాన్ని వుంచను ఫ్లాట్‌ఫారం కూడా లేదు. దీంతో శవాన్ని కిందపెట్టి పోస్ట్‌మార్టమ్ చేయాల్సి వస్తుంది. దీనివల్ల శవం నిశిత పరిశీలనలో ఫోరెన్సిక్ విభాగంలో పనిచేసే డాక్టర్, తోటీలు ఇబ్బందులు పడాల్సి వస్తుంది. జిల్లాలోని పాత ప్రభుత్వాసుపత్రుల్లో పోస్ట్‌మార్టం చేయను టేబుల్ వంటి వసతి ఉంది. గూడూరు వంటి చోట ప్రత్యేక ఫ్లాట్‌ఫారం ఉంది. కానీ జిల్లా కేంద్రంలోని పోస్ట్‌మార్టమ్ గది దుస్థితిలో ఉన్నా పట్టించుకోకపోవడం విమర్శలకు తావిస్తుంది. ఈ గది ప్రక్కనే ఉండే శవాలను భద్రపరిచే గదిలో అనాధ శవాలు ఖననానికి నోచుకోకపోవడాన్ని సామాన్యులు చూస్తే గుండె తరిగిపోతుంది. 40వేలు ఖర్చు చేస్తే కనీస సౌకర్యాలతో కొత్త పోస్ట్‌మార్టం గది నిర్మించవచ్చు. ఈ దిశగా వైద్య ఆరోగ్య శాఖాధికారులు అడుగులేస్తే బాగుంటుంది.

# నేతల జోక్యం వల్లే తెలంగాణ రభస!

**● తేల్చి చెప్పిన కొండా లక్ష్మణ్ బాపూజీ**



రౌండ్ టేబుల్ సమావేశంలో కొండా లక్ష్మణ్ బాపూజీ.

చిన్న రాష్ట్రాల ఏర్పాటుతోనే అభివృద్ధి సాధ్యమవుతుందని ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు కొండా లక్ష్మణ్ బాపూజీ అభిప్రాయపడ్డారు. సద్భావన యాత్ర ప్రారంభ సందర్భంగా నెల్లూరుకు వచ్చిన ఆయన వివిధ పార్టీల ప్రతినిధులతో, వివిధ సంస్థల ప్రతినిధులతో రౌండ్ టేబుల్ సమావేశం నిర్వహించారు. పలువురి అభిప్రాయాలను తెలుసుకొన్న లక్ష్మణ్ బాపూజీ మాట్లాడుతూ తెలంగాణ రాష్ట్రం ఏర్పాటుపై ఏ పార్టీలు, నేతలు జోక్యం చేసుకోవాల్సిన అవసరం లేదని ఇరు ప్రాంతాల ప్రజల అభిప్రాయాలే ముఖ్యమన్నారు. కలిసి ఉండాలా, వద్దా అనే అంశంపై ప్రజల నిర్ణయాన్ని గౌరవించాలన్నారు. దురదృష్టవశాత్తు నేడు ప్రభుత్వాలు ప్రజాస్వామ్యానికి, రాజ్యాంగానికి విలువ ఇవ్వడం లేదని ఆవేదన వ్యక్తం చేశారు. కలిసి మెలిసి ఉండాలని తెలుగు ప్రజలు కోరుకొంటున్నారని అయితే విడిపోవడమంటూ జరిగితే అన్నదమ్ముల్లా విడిపోయి కలిసి మెలిసి ఉండాలన్నారు. తెలంగాణతోపాటు ఆంధ్ర, రాయలసీమలకు ప్రత్యేక రాష్ట్రం కావాలని పోరాటం చేయాలని పిలుపునిచ్చారు. నగరంలోని టూరిజం హోటల్‌కు వచ్చిన ఆయన్ను తెలుగుదేశం పార్టీ జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి కలిసి అభినందించాడు. అనంతరం లక్ష్మణ్ బాపూజీ సద్భావన యాత్ర ప్రారంభించడంతోపాటు ఎసి సెంటర్‌కు వెళ్లి అక్కడ జై ఆంధ్ర ఉద్యమ స్థూపాన్ని సందర్శించారు. ఆయన రాక సందర్భంగా సమైక్యాంధ్ర వాదులు గొడవకు దిగుతారేమోనని భావించిన పోలీసులు కట్టుదిట్టమైన రక్షణ చర్యలు చేపట్టారు.



శోభానాయుడిని సత్కరిస్తున్న దీపావెంకట్, మురళీకృష్ణ హజరత్‌బాబు, డాక్టర్ వెంకటరమణారెడ్డి తదితరులు.

# నెల్లూరును మరచిపోలేను!

**✦ నృత్య కళాకారిణి శోభానాయుడు**

ప్రఖ్యాత కూచిపూడి నృత్య కళాకారిణి పద్మశ్రీ బిరుదాంకితురాలు డాక్టర్ శోభానాయుడుకు కళాంజలి అవార్డు పురస్కార ప్రదానోత్సవం 20వ తేది నెల్లూరు టౌన్‌హాల్‌లో ఆహుతుల నడుమ హృద్యంగా జరిగింది. కళాంజలి సంస్థ నిర్వాహకుడు అనంత్ ఆధ్వర్యంలో జరిగిన ఈ కార్యక్రమంలో స్వర్ణభారత్ ట్రస్ట్ దీప, మురళీకృష్ణ హోటల్స్ నిర్వాహకుడు హజరత్‌బాబు, బెనర్జీ తదితరులు పాల్గొని శోభానాయుడును ఘనంగా సత్కరించారు. ఈ సందర్భంగా శోభానాయుడు మాట్లాడుతూ సింహపురి సీమలో ఇలాంటి సత్కారం అందుకోవడం జీవితంలో మరచిపోలేనిదని సంతోషం వ్యక్తం చేశారు. ప్రేక్షకుల ఆశీస్సులు, అభిమానం ముందు పద్మభూషణ్‌లు తదితర బిరుదులు దిగతుడుపేనన్నారు. మన కళలు, సంస్కృతి పట్ల నేటి యువతకు ఆసక్తి తగ్గిందని, అదే పాశ్చాత్య దేశాలలో కూచిపూడికి ఎనలేని ఆదరణ ఉండడాన్ని ఈ సందర్భంగా ప్రస్తావించారు. ఆ రోజుల్లో వేదం లక్ష్మీనారాయణ శాస్త్రిలాంటి గురువులు ఉండబట్టే తనలాంటి వారు నృత్యం నేర్చుకోగలిగారని గుర్తు చేసుకొన్నారు. తెలుగు గడ్డపై కళలు అంతరించి పోవడం అంటూ జరగదని అభిరుచి గల ప్రేక్షకులు, కళా సంస్థలు ఉన్నంతకాలం కళలు వెలుగొందుతూనే ఉంటాయన్నారు. భగవత్ స్వరూపమైన కళలను భగవంతుడే కాపాడుకొంటాడన్నారు. గతంలో నెల్లూరులో నృత్యరూపకాన్ని ప్రదర్శించిన తర్వాత పద్మశ్రీ బిరుదు రావడం మరచిపోలేనిదన్నారు. ఈ కార్యక్రమం సందర్భంగా మాస్టర్ ఆదర్శ్, శారద తదితరులు చేసిన డ్యాన్సులు ఆకట్టుకొన్నాయి.

# గ్యాస్ సిలిండర్ల సరఫరా అబందర!

**● ఇక్కట్లు పడుతున్న నెల్లూరు జనం**



గోడౌన్ల నుంచే బ్లాక్‌మార్కెట్‌కు తరలుతున్నాయి.

జిల్లాలో గ్యాస్ సరఫరా అబందరగా మారింది. ఎప్పుడు గ్యాస్ బుక్ చేసినప్పటికీ అది ఎప్పుడు, ఎన్నాళ్లకు వస్తుందో అంతుచిక్కని ప్రశ్నగా మారింది. దీనికి కారణం గ్యాస్ ఏజెన్సీల నిర్వాకం. కొన్ని గ్యాస్ ఏజెన్సీలు వినియోగదారులు బుక్ చేసుకొన్న నిర్ణీత సమయానికి సిలిండర్ సరఫరా చేయకుండా వారికి తోచినపుడు అదీ వినియోగదారులు నాలుగైదుసార్లు కార్యాలయం చుట్టూ ప్రదక్షిణ చేసి గొడవకు దిగితే తాపీగా సిలిండర్ ఇస్తున్నారు తప్పటంచనుగా నిబంధనల ప్రకారం గ్యాస్ సరఫరా జరుగుతున్న దాఖలాలు లేవు. నిజానికి 21 రోజులకు సిలిండర్ సరఫరా జరగాల్సి ఉండగా నెలలు గడుస్తున్నా పంపిణీ జరగడం లేదు. జిల్లావ్యాప్తంగా 38 ఏజెన్సీల క్రింద సింగిల్, డబుల్, దీపం గ్యాస్ కనెక్షన్లు 4,15,120కి పైగా ఉన్నాయి. నెలకు 2.1 లక్షల సిలిండర్లు సరఫరా జరుగుతున్నప్పటికీ వినియోగదారులకు సక్రమంగా అందడం లేదు. బ్లాక్ మార్కెటింగ్‌కు సిలిండర్లు తరలిపోకుండా చర్యలు తీసుకొన్నామని పౌరసరఫరాల శాఖాధికారులు పదే పదే ప్రకటిస్తున్నా వాస్తవంగా చూస్తే బ్లాక్ మార్కెట్ లోనే సులువుగా సిలిండర్లు దొరుకుతున్నాయి. కొన్ని ఏజెన్సీలు అక్రమాలకు పాల్పడుతుంటే, మరికొన్ని చోట్ల డెలివరీ సిబ్బంది చేతివాటం ప్రదర్శిస్తున్నారు. మద్రాస్ బస్టాండ్ సమీపంలోని వాహబ్‌పేటలో గల గ్యాస్ ఏజెన్సీలో ఇలాంటి అక్రమాలు అధికంగా జరుగుతున్నాయని, అదేమని ప్రశ్నిస్తే దిక్కున్న చోట చెప్పుకోమని దబాయిస్తున్నారని వినియోగదారులు వాపోతున్నారు. ఇలాంటి ఘటనలు కోకొల్లలు.

# దడపుట్టిస్తున్న చైన్ స్నాచర్‌లు!

**మహిళలూ జర జాగ్రత్త!**

నగరంలో చైన్ స్నాచర్‌లు పెట్రేగి పోతున్నారు. రాత్రి పగలు అనే తేడా లేకుండా మహిళలు, పురుషుల మెడలలోని బంగారు చైన్‌లను దోచుకొనేవారి సంఖ్య అధికమవుతుంది. వాహనాలలో తిరుగుతూ చైన్‌లు తెంపుకపోయే ముఠా ఇప్పుడు పంథా మార్చింది అనేందుకు ఇటీవల నగరంలో జరిగిన సంఘటనలే ఉదాహరణ. ఇంజనీరింగ్ చదివే విద్యార్థి కొద్ది రోజుల క్రిందట మధ్యాహ్నం సమయంలో కస్తూరిదేవి స్కూలు వద్ద ఉండగా రోడ్డుపై నిలబడి ఉన్న ఇద్దరు వ్యక్తులు అతన్ని పిలిచి దగ్గరకు రాగానే ఇనుప రాడ్‌తో కొట్టి మెడలోని చైన్‌ను దొంగిలించుకొని వెళ్లారట. గాయాలపాలైన ఆ యువకుడు ఫోర్ట్‌టౌన్ పోలీస్‌స్టేషన్‌లో ఫిర్యాదు చేశాడు. ఈ ఘటన జరిగిన రెండు, మూడు రోజుల వ్యవధిలోనే ఒక మండల విద్యాధికారి మద్రాస్ బస్టాండ్ వద్ద గల కూరగాయల మార్కెట్ నుంచి ఆర్టీసి వైపు వెళ్తుండగా సమీపంలో గల కల్వర్టు వద్ద ఉన్న వ్యక్తులు అతన్ని పిలిచి దగ్గరకు రాగానే నగలు తస్కరించేందుకు యత్నించగా ఆ వ్యక్తి అడ్డుకోపోగా ఇనుపరాడ్‌తో గతంలో విద్యార్థిపై దాడిచేసిన విధంగానే తలపై ఇష్టానుసారంగా కొట్టడంతో ఆ దెబ్బలకు ఆ వ్యక్తి స్పృహతప్పి పడిపోయాడట. తెలివి వచ్చిన అనంతరం పోలీసులకు ఫిర్యాదు చేశాడు. ఇరువురు వ్యక్తులపై ఒకే మాదిరిగా దాడి చేయడం, మనుషుల సంచారం తక్కువ ఉన్న చోట ఉండి ఇలాంటి ఘటనలకు పాల్పడుతుండడంతో ప్రజలు హడలి పోతున్నారు.

# అంగన్‌వాడీలకు కులగణన బాధ్యత!

**● ఇక జరిగినట్లే!**

జిల్లాలో సామాజిక, ఆర్థిక, కులగణన కార్యక్రమానికి అంగన్‌వాడి వర్కర్లను నియమించడంతో ఆ కేంద్రాలు మూతవేయాల్సిన పరిస్థితి ఏర్పడింది. జిల్లాలోని పన్నెండు మండలాల్లో తొలిదశలో ఈ సర్వే కార్యక్రమం ప్రారంభించారు. స్త్రీ, శిశు సంక్షేమ శాఖ ఉత్తర్వుల ప్రకారం కేంద్రాల పనివేళల్లో ఇతర కార్యక్రమాలకు హాజరు కాకూడదు. ప్రభుత్వ ఉత్తర్వుల గురించి ఐసిడిఎస్ సూపర్‌వైజర్లకు సరైన అవగాహన లేకుండా పోయింది. అంగన్‌వాడి వర్కర్లు సర్వేకు వెళ్లేందుకు వీరు అనుమతి ఇవ్వడంతో దాదాపు పది రోజులపాటు కేంద్రాలు తెరుచుకోలేదు. ఇదిలా ఉండగా మరికొన్ని ఐసిడిఎస్ ప్రాజెక్ట్ పరిధిలో అంగన్‌వాడి వర్కర్లను వారం రోజులపాటు శిక్షణకు పంపారు. నెల్లూరు నగరంలో మురళీకృష్ణ నర్సింగ్ కళాశాలలో శిక్షణ కార్యక్రమం ఏర్పాటు చేశారు. ఈ క్రమంలో కూడా కేంద్రాలు మూసివేయాల్సి వచ్చింది. తరచూ అంగన్‌వాడి కేంద్రాలు మూసివేయడం వల్ల విద్యార్థుల సంఖ్య గణనీయంగా తగ్గే అవకాశం ఉంది. ఇప్పటికైనా ఆ శాఖ ఉన్నతాధికారులు స్పందించి ప్రభుత్వ ఉత్తర్వులను అమలు చేసేందుకు చర్యలు తీసుకోవాల్సిన అవసరం ఉంది.

## ● బ్లాక్‌మార్కెట్‌కు

# ఎరువులు, విత్తనాలు!

**జిల్లాలో వ్యవసాయ సీజన్ మొదలయ్యింది కానీ రైతుకు అవసరమైన విత్తనాలు, ఎరువులు అందుబాటులో లేవు. ఈ రెండింటికి ఎక్కడలేని డిమాండ్ ఉండడంతో బ్లాక్ మార్కెట్‌కు తరలించి వ్యాపారస్తులు సొమ్ము చేసుకొంటున్నారు.**



ఎరువులకు ఎక్కడలేని డిమాండ్.

జిల్లాలో వ్యవసాయ సీజన్ ప్రారంభమైంది. వరిపంట సాగుకు సమాయత్తం అయ్యే రైతులకు విత్తనాలు, ఎరువుల కొరత ఏర్పడింది. సీజన్ ప్రారంభం కాక ముందు నుంచి రైతులకు అవసరమైన విత్తనాలు, ఎరువులను అందుబాటులో వుంచేందుకు వ్యవసాయశాఖ అధికారులు చర్యలు తీసుకోవాల్సి వుంటుంది. జిల్లా కలెక్టర్ సైతం సమీక్షా సమావేశాలు నిర్వహించి అధికారులను ఆదేశించినా వారిలో కదలిక కానరావడం లేదు. ఎరువుల ధరలు విపరీతంగా పెరగడంతో నిల్వ వున్న ఎరువులను రహస్య ప్రదేశాలకు తరలించి అధిక ధరలకు విక్రయిస్తున్నారు వ్యాపారులు.

ఈ సీజన్‌లో వరిసాగుకు సంబంధించి ఏ రకాల వరి విత్తనాలు వేస్తే అధిక దిగుబడులు వస్తాయో వ్యవసాయశాఖ అధికారులు ముందుగా రైతులకు తెలియజేయాలి. అయితే అధికారులు ఎటువంటి సమాచారం అందించకపోవడంతో రైతులు వరివిత్తనాల రకాల కోసం వెతుకులాడుతున్నారు. ఇప్పటికే పెన్నా డెల్టాలోని కొన్ని మండలాల్లో వరినాట్లు వేస్తున్నారు. మోటార్ల ద్వారా నీటి సరఫరా అయ్యేప్రాంతాల్లో నలభైశాతం వరకు వేయడం జరిగింది. మిగిలిన ప్రాంతాల్లో దుక్కులు దున్నుకొని నారుమళ్లు సిద్ధం చేసుకుంటున్నారు. ఇటీవల కురిసిన భారీవర్షాల కారణంగా పొలాల్లో అధికంగా వర్షపు నీరు చేరింది. ఈ నీరంతా బయటకు వెళ్తేగాని వ్యవసాయసాగుకు సిద్ధమయ్యే అవకాశం లేదు. నారుమళ్లు పోసుకొని నాట్లు వేసేందుకు దాదాపు 45 రోజుల వ్యవధి పడుతుంది.

మార్కెట్లో నాణ్యత గల వరివిత్తనాలు దొరకడం లేదని రైతులు ఆందోళన చెందుతున్నారు. ప్రభుత్వ ఆధ్వర్యంలో ఏర్పాటు చేయబడిన విత్తనాభివృద్ధి సంస్థ అధికారులు రైతులకు నాణ్యత గల విత్తనాలను అందించేందుకు చర్యలు తీసుకోవడం లేదు. మార్కెట్లో కొనుగోలు చేసిన వరి విత్తనాలు సక్రమంగా మొలకెత్తడం లేదని రైతులు వాపోతున్నారు. వ్యవసాయసాగు చేసేందుకు అధిక ఖర్చులు భరించాల్సిన పరిస్థితి ఏర్పడింది. ఇటువంటి సమయంలో వరి విత్తనాలు నాణ్యతలేనివి విక్రయిస్తుండడం వలన మరింత నష్టపోవాల్సి వుంటుందని ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. వరి విత్తనాలకు తోడు యూరియా, డిఏపి కాంప్లెక్స్ ఎరువుల ధరలు ఆకాశన్నంటుతున్నాయి.

జిల్లాలో ముందుగా వరినాట్లు వేసిన రైతులు రసాయనిక ఎరువులను వాడాల్సి వుంటుంది. రసాయనిక ఎరువులను కొనుగోలు చేసేందుకు దుకాణాల వద్దకు వెళితే అధిక ధరలు చెబుతున్నారు. గత సీజన్‌కు ఇప్పటికి యాభైశాతం యూరియాపై, వంద శాతం డిఏపి ఎరువులపై ధరలు పెంచారు. కేంద్ర ప్రభుత్వం రసాయనిక ఎరువుల ధరలపై నియంత్రణ చేయకపోవడంతో వ్యాపారులు ఇష్టానుసారంగా ధరలు పెంచుకుపోతున్నారు. ఎవరైనా రైతులు ధరల గురించి ప్రశ్నిస్తే ఎరువుల కొరత వుందని సమాధానం చెబుతున్నారు. విధిలేని పరిస్థితుల్లో కొనుగోలు చేయకతప్పడం లేదు.

మరికొన్ని మండలాల్లో వరినాట్లు ప్రారంభమైతే ఎరువుల కొరత తీవ్రంగా వుండే అవకాశం వుంది. రైతులు తీవ్రంగా నష్టపోక ముందే జిల్లా వ్యవసాయశాఖ అధికారులు స్పందించి రైతులకు అవసరమైన వరి విత్తనాలు, రసాయనిక ఎరువులను అందుబాటులో వుంచాల్సిన అవసరం వుంది.

# మూసుకుపోయిన సముద్ర ముఖ ద్వారాలు!

**తడ నుంచి తెట్టు వరకు జిల్లాలో విస్తరించి ఉన్న సముద్ర ముఖ ద్వారాలు మూసుకపోయాయి. దీనివల్ల నదులు, వాగులు, వంకలు, పంట కాల్వలు పొంగి ప్రవహించినపుడు సముద్రానికి చేరవలసిన వెల్లువకు అడ్డంకి ఏర్పడుతుంది. ఈ సమయంలో తీరప్రాంత గ్రామాలు ముప్పు సమస్యను ఎదుర్కొంటున్నాయి.**



సముద్ర ముఖ ద్వారాన్ని పరిశీలిస్తున్న కలెక్టర్.

జిల్లాలోని కావలి నుండి తడ వరకు విస్తరించి వున్న సముద్ర ముఖ ద్వారాలు మూసుకుపోయాయి. ఈ ముఖ ద్వారాలు మూసుకుపోవడంతో నదులు, వాగులు, వంకల నీరు సముద్రంలోకెళ్లే అవకాశం లేకుండా పోయింది. భారీ వర్షాలు సంభవించినప్పుడు ఎగువ ప్రాంతం నుంచి అధికంగా వర్షపునీరు వచ్చి ఇక్కడ చేరుతుంది. ఈ నీరంతా ముఖ ద్వారాల నుంచి సముద్రంలోకి వెళ్లాలి. గత రెండు, మూడు ఏళ్ల నుంచి ముఖ ద్వారాలల్లో పూడిక తీయడం లేదు. దీంతో సముద్రంలోకి చేరాల్సిన నీరు సమీప గ్రామాల్లోకి వెళ్తుంది. గ్రామాల్లోకి నీరు చేరడంతో మత్స్యకారులు భయాందోళన చెందుతున్నారు.

బ్రిటీష్ వారి హయాంలో సముద్ర ముఖ ద్వారాల ఏర్పాటు జరిగింది. వీటి నుంచి పడవుల ద్వారా రవాణా జరిగేది. బకింగ్‌హామ్ కాల్వను అప్పట్లో ఆధునీకరించి వివిధ ఓడరేవులకు సరుకులను రవాణా చేసేవారు. ప్రస్తుతం బకింగ్‌హామ్ కాల్వ పరిస్థితి ప్రశ్నార్థకంగా మారింది. వాటి మరమ్మత్తులు, ముఖ ద్వారాల పూడికతీత గురించి మన ప్రభుత్వం పట్టించుకునే దాఖలాలు కనిపించడం లేదు. భారీ వర్షాలు, తుఫాన్‌లు సంభవించినప్పుడు మాత్రం వీటి గురించి ప్రస్తావిస్తారు. ప్రభుత్వానికి ప్రతిపాదనలు పంపి పూడికతీతకు చర్యలు తీసుకుంటామని ప్రకటిస్తుంటారు. తీరప్రాంత గ్రామాలకు సముద్ర ముఖ ద్వారాల నుంచి ముప్పు పొంచి ఉన్న విషయం అధికారులకు తెలిసినా చర్యలు మాత్రం లేవు.

కావలి మండలం పెద్ద పట్టపుపాళెం నుంచి తడ మండలం వరకు దాదాపు రెండు వందల కిలో మీటర్ల పరిధిలో తీరప్రాంతం వుంది. సూళ్లూరుపేట సమీపంలో పులికాట్ సరస్సు పరిస్థితి కూడా దారుణంగా మారింది. ఇక్కడ కూడా ముఖ ద్వారాలు మూసుకుపోయి ఉన్నాయి. ఈ సరస్సుకు వివిధ దేశాలకు చెందిన పక్షులు ప్రతి సంవత్సరం అక్టోబర్ నుంచి మార్చి వరకు వలసలు వస్తుంటాయి. వీటికి అవసరమైన ఆహారాన్ని పులికాట్ సరస్సులో దొరికే చేపలు, పురుగులను తింటుంటాయి. సరస్సులో నీటి నిల్వలు ఉండకపోవడం వల్ల వలస పక్షులు ఇక్కడకు రావడం కొంతమేర తగ్గింది.

ఇటీవల జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి ఇందుకూరుపేట మండలం గంగపట్నం సమీపంలో వున్న సముద్ర ముఖ ద్వారాల పరిశీలనకు వెళ్లి అక్కడ నివసించే గ్రామస్తులు చెప్పిన వివరాలను విని ఆందోళన చెందారు. 2004 సంవత్సరంలో సంభవించిన సునామీ కారణంగా దాదాపు పది మందికి పైగా ఈ మండలంలో మరణించారు. ఆ సంఘటన నుంచి ఇంకా తేరుకోలేక పోతున్నారు ప్రజలు. సునామీకి తోడు సముద్ర ముఖ ద్వారాలు పూర్తిగా మూసుకుపోవడంతో ఏ క్షణంలోనైనా గ్రామాలకు ప్రమాదం వాటిల్లే అవకాశం ఉందని కలెక్టర్‌తో మొరపెట్టుకున్నారు.

ఇసుకతో నిండిపోయిన ముఖ ద్వారాలను పరీక్షించి పూడికతీతకు ప్రభుత్వానికి ప్రతిపాదనలు పంపి నిధులు మంజూరు చేయించేందుకు కృషి చేస్తానని కలెక్టర్ గ్రామస్తులకు హామీ ఇచ్చారు. అప్పటికప్పుడు పూడికతీతకు జిల్లా కలెక్టర్ నిధుల నుంచి 20 లక్షల రూపాయలు మంజూరు చేశారు. జిల్లాలో ఉన్న సముద్ర ముఖ ద్వారాలన్నింటికీ పూడిక తీయించేందుకు కోట్ల రూపాయలు ఖర్చు అవుతాయి. భారీ వర్షాలు సంభవించక ముందే ముఖ ద్వారాలను అభివృద్ధి పరచాల్సిన అవసరం ఉంది.


నెల్లూరు ఎమ్మార్వో ఆఫీసులోని ప్రజా సేవా కేంద్రాన్ని తనిఖీ చేస్తున్న కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి.


కొత్తూరులో ఇందిరమ్మ ఇళ్ల నిర్మాణంలో జాప్యాన్ని నిరసిస్తూ నెల్లూరు ఆర్డీఓ కార్యాలయం వద్ద ధర్నా చేస్తున్న వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ నాయకుడు అనిల్‌కుమార్ యాదవ్.

# గూడూరులో పోటాపోటీ నిరసనలు!

## ● సంతోషించిన జనం

ప్రజా సమస్యలపై స్పందించడంలో, ఆందోళన జరపడంలో రాజకీయ పార్టీలు, నేతల మధ్య పోటీ నెలకొంటుంది అనేందుకు గూడూరు పట్టణంలో ఇటీవల వివిధ పార్టీలు నిర్వహించిన కార్యక్రమాలే నిదర్శనం. అన్ని వస్తువుల ధరలు విపరీతంగా పెరగడం వలన సామాన్యులు జీవించలేని పరిస్థితి నెలకొనిందంటూ తెలుగుదేశం, సిపిఎం, సిపిఐ తదితర ప్రజాసంఘాలు పట్టణంలోని గడియారపు స్తంభం వద్ద జైల్‌భరో కార్యక్రమాన్ని నిర్వహించాయి. దీనికి హాజరైన శాసన సభ్యుడు బల్లి దుర్గాప్రసాద్ మాట్లాడుతూ కాంగ్రెస్ ప్రభుత్వంలో సామాన్యులు జీవించలేని స్థితికి వచ్చారన్నారు. దీనికి కారణం నిత్యావసర వస్తువుల ధరలు ఆకాశాన్నంటుతున్నా ప్రభుత్వం ధరల నియంత్రణకు చర్యలు చేపట్టలేకపోవడమేనని విమర్శించారు. వీటి గురించి పట్టించుకోకుండా కిలో బియ్యం రూపాయికి ఇవ్వడం వలన ఒరిగేదేమీ లేదన్నారు. పేద, మధ్యతరగతి ప్రజలు కడుపు నిండా తిండితినలేని పరిస్థితులు నెల కొన్నాయన్నారు. పోలీసులు నిరసన తెలుపుతున్న నేతలను ఎమ్మెల్యేతోసహా అరెస్టు చేసి సొంత పూచీకత్తుపై విడుదల చేశారు. మరోవైపు వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ ఎరువుల ధరల పెరుగుదలను నిరసిస్తూ పట్టణంలో ర్యాలీ నిర్వహించింది. ప్రభుత్వ నిర్వాకం వల్ల రైతులు వ్యవసాయం చేయలేని పరిస్థితిలో వున్నారని ఆపార్టీ నేతలు బత్తిన విజయకుమార్, పేర్నేటి శ్యాంప్రసాద్ రెడ్డి విమర్శించారు. సంగం థియేటర్ కూడలి నుంచి సబ్ కలెక్టర్ కార్యాలయం వరకు రైతులతో కలసి ర్యాలీ నిర్వహించి ప్రభుత్వానికి వ్యతిరేకంగా నినాదాలు చేశారు. పెరిగిన ధరలపై పలు పార్టీలు నిరసన కార్యక్రమాలు చేపట్టడంతో పట్టణంలో సందడి నెలకొనింది.

# స్మగ్లింగ్ పట్ల యువత ఆసక్తి!

## కలువాయిలో ఉపద్రవం

కలువాయి మండలంలోని యువకులు సులభంగా డబ్బు సంపాదించే మార్గంగా ఎర్రచందనం అక్రమ రవాణాను ఎంచుకొనడంతో వారి జీవన సరళి రాత్రికి రాత్రి మారిపోతోంది. నిన్న మొన్నటి వరకు పని పాట లేక జులాయిగా తిరిగిన వారందరూ ఎర్రచందనం స్మగ్లింగ్ చేస్తుండడంతో చేతి నిండా డబ్బులు వుంటున్నాయి. దీంతో రాత్రికి రాత్రి లక్షాధికారులుగా అవతారం ఎత్తుతున్నారు. అక్రమ సంపాదనతో భూములు కొనడం, ఇళ్లు, ఖరీదైన ఫర్నిచర్, వాహనాలు కొనుగోలు చేయడంతోపాటు పెద్ద ఎత్తున బంగారాన్ని బిస్కెట్లు, నగల రూపంలో కొంటున్నట్లు తెలుస్తోంది. విలాసవంతమైన వీరి జీవన విధానాన్ని చూసి మరికొందరు నిరుద్యోగ యువత సులభమైన మార్గంగా దీనిని భావిస్తుండడంతో ఎర్రచందనం స్మగ్లింగ్ చేసే వారు అధికమవుతున్నారు. షుమారు వెయ్యిమంది అక్రమ వ్యాపారం చేస్తున్నట్లు ఫారెస్టు అధికారులు, పోలీసుల వద్ద సమాచారం వుంది. అయితే నేతల అండదండలు వుండడం, లంచాలు చెల్లిస్తుండడంతో వారి జోలికి వెళ్లడం లేదు. మరోవైపు ఎర్రచందనం అక్రమ వ్యాపారానికి లక్షలు పెట్టుబడిపెట్టిన ఫైనాన్సియర్ల పరిస్థితి మాత్రం దయనీయంగా వుంది. స్మగ్లర్లు డబ్బులు చెల్లించకుండా వుంటుండడంతో బయటికి చెప్పుకోలేక, ఇచ్చిన డబ్బులు వసూలు కాక ఫైనాన్సియర్లు లోలోపల కుమిలిపోతున్నారు.

# గిరిజనునికి భూమి ఇప్పించిన కలెక్టర్!



పేదవారి భూమిని ఆక్రమించుకొని రొయ్యల సాగు చేస్తున్న వ్యక్తి నుంచి స్థలాన్ని విడిపించి బాధితురాలికి న్యాయం చేసిన కలెక్టర్ శ్రీధర్ పట్ల ప్రశంసల జల్లు కురుస్తోంది. చిట్టమూరు మండలం పిట్టవానిపల్లె గ్రామానికి చెందిన కోడూరు సరోజనమ్మకు ప్రభుత్వం సర్వే నెంబర్ 65లో 3.25 ఎకరాల భూమి ఇచ్చింది. ఈ భూమిని సుందరయ్య అనే భూస్వామి ఆక్రమించుకొని రొయ్యలసాగు చేపట్టాడు. ప్రశ్నించిన

## గ్రామ పర్యటన వల్ల జరిగిన మేలు

సరోజనమ్మపై దౌర్జన్యానికి దిగాడు. ఆమె దీనిపై పోలీసులకు, రెవెన్యూ అధికారులకు విన్నవించినా న్యాయం జరగలేదు. ఈ పరిస్థితుల్లో ఆమె మరణించింది. ఇటీవల ఎల్లసిరి ఎగువ కాలనీలో గిరిజన సదస్సుకు హాజరైన కలెక్టర్ శ్రీధర్ దృష్టికి సరోజనమ్మ కుమారుడు తమకు జరిగిన అన్యాయాన్ని వివరించాడు. తీవ్రంగా స్పందించిన కలెక్టర్ రెవెన్యూ సిబ్బందిపై ఆగ్రహం వ్యక్తం చేయడమేకాక దగ్గరుండి ఆక్రమణదారుని నుంచి భూమిని విడిపించి బాధిత కుటుంబాలకు న్యాయం చేశాడు. భూస్వామి చేతిలో ఎంతోకాలంగా చెర చిక్కిన భూమిపై కలెక్టర్ స్పందించడం పట్ల గ్రామంలో హర్షాతిరేకాలు వ్యక్తమయ్యాయి. ఇప్పటికైనా రెవెన్యూ, పోలీస్ యంత్రాంగంలో మార్పు వస్తే ఇలాంటి సమస్యలకు పరిష్కారం దొరుకుతుంది.

# ఆయన అవమానించినా మేము ఆదరిస్తాం!

రెండున్నర దశాబ్దాల రాజకీయ చరిత్ర కల్గిన విష్ణువర్ధన్‌రెడ్డి వైఎస్ జగన్‌పార్టీలో చేరి అవమానం పాలయ్యాడని ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి వ్యంగ్యవ్యాఖ్యలు చేశారు. ఇటీవల కావలికి వచ్చిన మంత్రి విష్ణు గురించి పైవిధంగా మాట్లాడారు. మాజీ ఎమ్మెల్యే విష్ణు కాంగ్రెస్‌పార్టీలో పుట్టి పెరిగాడు. అలాంటి వ్యక్తి వైఎస్ రాజశేఖర్‌రెడ్డిపై వున్న అభిమానంతో జగన్‌తో

## విష్ణుకు రామనారాయణ ఎత్తి పొడుపు

సంబంధాలు కొనసాగించేందుకు ప్రయత్నించి అభాసుపాలయ్యాడన్నారు. జగన్ దగ్గర ఆయనకు తీరని అవమానం జరిగిందని, దాని నుంచి బయటపడి మరో మార్గంలో నడచి ప్రజలకు సేవ చేయాలన్నారు. విష్ణు తిరిగి కాంగ్రెస్ పార్టీలోకి వస్తానంటే స్వాగతం పలుకుతామని చెప్పడంతో విష్ణు కాంగ్రెస్‌లోకి పునరాగమనం ఖాయమైనట్లేనన్న వ్యాఖ్యలు వినవస్తున్నాయి.

# ఇనాం భూములపై విచారణ జరిపిస్తా!

తోటపల్లి గూడూరు మండలం తోటపల్లిలో గల ఇనాం భూములపై విచారణ జరిపించాలని సిపిఎం డిమాండ్ చేసింది. ఈ భూముల వ్యవహారం చాలా కాలంగా నలుగుతున్న సమస్య. ఇటీవల జరిగిన రచ్చబండ కార్యక్రమానికి సర్వేపల్లి శాసనసభ్యుడు ఆదాల ప్రభాకర్‌రెడ్డి, జిల్లా కలెక్టర్ శ్రీధర్ విచ్చేయగా వారి దృష్టికి ఈ భూముల సమస్యను తీసుకొని వచ్చింది సిపిఎం. జిల్లా రైతు సంఘం అధ్యక్షుడు గంగపట్నం రమణయ్య సాగుదార్లతో వచ్చి ఈ సమస్య పూర్వాపరాలను వివరించాడు. 1 నుంచి 75వరకు గల సర్వే నెంబర్లలో 370 ఎకరాల ఇనాం భూమి వుండగా అందులో 250 ఎకరాలు మారంరెడ్డి ఓబులరెడ్డి, వేమారెడ్డి ప్రసాద రెడ్డి కుటుంబాలు బ్రాహ్మణుల నుంచి స్వాధీనపరచుకొని అనుభవిస్తున్నారని ఆరోపించారు. భూముల వ్యవహారంపై కోర్టుకు సైతం వెళ్లగా అధికారులకు విచారణ జరపమని ఆదేశించినా ఇంతవరకు ఎలాంటి విచారణ చేపట్టలేదని విమర్శించారు. దీనిపై కలెక్టర్ స్పందిస్తూ ఇనాం భూముల వ్యవహారంపై సమస్య పరిష్కారానికి కృషి చేస్తామని హామీ ఇవ్వడంతో సిపిఎం నేతలు శాంతించారు.

# బీద అందరివాడా?

## అన్ని పార్టీల వారూ ప్రశంసిస్తున్నారు!

కావలి నియోజక వర్గంలో ఎమ్మెల్యే బీద మస్తాన్ రావు వ్యవహార శైలి అందరిని ఆశ్చర్యపరుస్తోంది. ప్రతిపక్ష పార్టీకి చెందిన వాడైనప్పటికీ అధికారపక్షం నేతలతో కలసిమెలసి తిరుగుతూ ప్రభుత్వ పథకాలు, కార్యక్రమాలు సక్రమంగా అందేలా, సాఫీగా జరిగేలా చేస్తుండడంతో అక్కడ ప్రతిపక్షం, అధికారపక్షం అన్న తేడా లేకుండాపోయింది. నియోజక వర్గ అభివృద్ధి పరంగా అధికారపార్టీ నేతలతో విభేదాలు లేకుండా చూసుకొంటూ అనుకొన్న పనులు సాధించుకొంటూ చాపక్రింద నీరులా పని చేసుకపోతుండడం అందరిని నివ్వెరపరుస్తోంది. కావలి నియోజకవర్గానికి మంత్రి రామనారాయణ రెడ్డి ఎప్పుడు వచ్చినా బీద మస్తాన్‌రావు ప్రతిపక్ష పార్టీకి చెందిన వ్యక్తన్న పట్టింపు లేకుండా అధికార కార్యక్రమాలలో చురుకుగా కలసిమెలసి పాల్గొనడం ఈ విషయాన్ని తెలియజేస్తుంది. అందువలనే మంత్రి స్వంతపార్టీ వారికి కాకుండా మస్తాన్‌రావుకే 90శాతం నిధులు కేటాయిస్తుండడం విశేషం. దీంతో ప్రజల సమస్యలపై ప్రశ్నించే వారే లేకుండా పోయారన్న విమర్శలు వ్యక్తం అవుతున్నాయి. ఇటీవల జరిగిన రచ్చబండ కార్యక్రమంలోను ఎలాంటి రచ్చలు, రావిక్లకు తావు లేకుండా సాఫీగా జరిగిపోవడానికి కారణం అధికార, ప్రతిపక్ష పార్టీ నేతలు కలసిమెలసి పనిచేయడమేనన్న నిజాన్ని నిరూపించింది. మరోవైపు కాంగ్రెస్‌పార్టీకి చెందిన మాజీ శాసన సభ్యురాలు మాగుంట పార్వతమ్మ సైతం మస్తాన్‌రావుపై పొగడ్తల జల్లు కురిపించడం పలువురిని ఆకట్టుకొంది. మొత్తం మీద బీదమస్తాన్‌రావు, ఎదుటివారిని నొప్పించక, తాను ఇబ్బంది పడకుండా అభివృద్ధి పనులు చేస్తుండడాన్ని నియోజకవర్గ ప్రజలు చర్చించుకొంటున్నారు.

# బిట్రగుంట అభివృద్ధికి సహకరిస్తా!


బిట్రగుంటలో రైల్వే ఆస్తులను పరిశీలిస్తున్న ఎమ్పీ చింతామోహన్. ప్రక్కన ఎమ్మెల్యే మస్తాన్‌రావు, మాజీ సర్పంచ్ సురేష్.

## రైల్వే ఆస్తులు చూసిన చింతా

ఎంతో ఘనచరిత్ర కలిగిన బిట్రగుంట రైల్వేస్టేషన్ అభివృద్ధికి నోచుకోకపోవడం బాధాకరం అని తిరుపతి పార్లమెంటు సభ్యుడు చింతామోహన్ వ్యాఖ్యానించారు. బిట్రగుంట అభివృద్ధి మండలి అభ్యర్థన మేరకు స్టేషన్ సందర్శనకు వచ్చిన చింతా ఆ ప్రాంతాన్ని, రైల్వే ఆస్తులను చూసి ఆశ్చర్యం వ్యక్తం చేశారు. వందలాది ఎకరాలు, పుష్కలంగా వనరులున్నప్పటికీ తగినంత అభివృద్ధి జరగకపోవడం సిగ్గుపడాల్సిన విషయమన్నారు. బిట్రగుంట రావడం మొదటిసారని చెప్పిన ఆయన రైల్వేకు సంబంధించిన ఇంగ్లీషు మీడియం స్కూలు, ఎడిఇఎన్ బంగ్లా, రైల్వే ఆరోగ్య కేంద్రం, స్టేషన్, వివిధ శాఖల కార్యాలయాలను కలియతిరిగి పరిశీలించారు. ఈ సందర్భంగా స్థానిక శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు గతంలో రైల్వే మంత్రిగా లాలూప్రసాద్ యాదవ్ వున్నప్పుడు కాంక్రీట్ స్లీపర్ నిర్మాణానికి శంకుస్థాపన చేశారని, తర్వాత ఎలాంటి నిర్మాణం జరగలేదని ఎమ్పీ దృష్టికి తీసుకొని వచ్చారు. మరమ్మత్తుల కర్మాగారాన్ని ఏర్పాటు చేయాలని కోరడంతోపాటు పలు సమస్యలను ప్రస్తావించారు. దీనికి చింతామోహన్ స్పందిస్తూ రైల్వే పరంగా బిట్రగుంటను అభివృద్ధి చేయడానికి కేంద్రమంత్రిత్వ శాఖలో చర్చిస్తానని హామీ ఇచ్చారు. ఎంపి వెంట రైల్వే అభివృద్ధి మండలి సభ్యుడు డాక్టర్ ఆనందసాగర్, మాలెపాటి నాగేశ్వరరావు తదితరులు వున్నారు.


స్వర్గీయ ఇందిరాగాంధీ జయంతిని పురస్కరించుకొని నెల్లూరు ఇందిరాభవన్‌లోని ఆమె విగ్రహానికి నివాళులర్పిస్తున్న జిల్లా మహిళా కాంగ్రెస్ అధ్యక్షురాలు అరుణమ్మ.

# సిఎంపై పితాని ప్రశంసల జల్లు

## మంత్రిలో ఎంతమార్పు?

ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి ఎన్నో సంక్షేమ పథకాలు పేదల కోసం ప్రవేశపెడుతున్నారని జిల్లా ఇన్‌ఛార్జి మంత్రి పితాని సత్యనారాయణ కితాబిచ్చారు. గూడూరు మండల పరిషత్ కార్యాలయ ఆవరణలో జరిగిన రెండవ విడత రచ్చబండ కార్యక్రమానికి విచ్చేసిన మంత్రి రాష్ట్రప్రభుత్వం చేపడుతున్న పథకాలను వివరించారు. అర్హులైన పేదలకు పింఛనులు, తెల్ల రేషన్‌కార్డులు రచ్చబండ ద్వారా అందించడం జరుగుతుందన్నారు. ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి ఒక్క రూపాయికే కిలో బియ్యం, రాజీవ్ యువకిరణాలు తదితర కార్యక్రమాలకు శ్రీకారం చుట్టారన్నారు. ఇంతగా అభివృద్ధి కార్యక్రమాలు చేపడుతున్నా కొందరు పనిగట్టుకొని దుష్ప్రచారం చేస్తున్నారని విమర్శించారు. ఈ సందర్భంగా మంత్రి పదే పదే కిరణ్ కుమార్‌రెడ్డి పేరు ప్రస్తావించడంతో వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ కార్యకర్తలు అడ్డు తగలడంతో గొడవ జరిగింది. పోలీసులు రంగప్రవేశం చేయడంతో గొడవ సద్దుమణిగింది. తిరుపతి ఎంపి చింతామోహన్ మాట్లాడుతూ భవిష్యత్తులో జిల్లా హాంకాంగ్ మాదిరి తయారవుతుందన్నారు. దుగరాజుపట్నం పోర్టు గురించి ప్రస్తావించిన చింతా ధరల పెరుగుదలపైనా తనదైన శైలిలో వ్యాఖ్యలు చేశారు. అరబ్ దేశాలలో యుద్ధవాతావరణం నెలకొని వున్నందున ఆయిల్ ధరలు పెరుగుతున్నాయని ఆ ప్రభావం నిత్యావసర వస్తువుల ధరలపై పడుతోందన్నారు. గూడూరు శాసనసభ్యుడు బల్లి దుర్గాప్రసాద్ మాత్రం రచ్చబండపై విమర్శలు గుప్పించాడు. గతంలో జరిగిన రచ్చబండ కార్యక్రమంలో ఇచ్చిన అర్జీలకే దిక్కులేకుండా పోయిందని, తగుదునమ్మా అని రెండో విడతగా అర్జీలు స్వీకరించి ప్రజలను మోసం చేస్తున్నారని ఆరోపించడంతో గందరగోళం నెలకొంది.

# గూడూరులో బల్లి X పనబాక!

## అనుచరుల మధ్య నువ్వా - నేనా?

గూడూరు నియోజకవర్గ అభివృద్ధి పనులు జరుగుతున్న విషయమై అధికార కాంగ్రెస్‌పార్టీ, ప్రతిపక్ష తెలుగుదేశంపార్టీల మధ్య రసవత్తర చర్చ జరుగుతోంది. కాంగ్రెస్‌పార్టీకి చెందిన పనబాక కృష్ణయ్య వివిధ అభివృద్ధి పనుల విషయమై ప్రకటన చేస్తుండడం, నిధులు ఇంతింత విడుదలయ్యాయని చెప్పుండడం పట్ల దూమారం రేగింది. తెలుగుదేశం పార్టీకి చెందిన మాజీ కౌన్సిలర్లు ఈ విషయంపై విలేకరుల సమావేశం పెట్టి కృష్ణయ్య తీరుపై విరుచుకపడ్డారు. శాసనసభ్యుడైన బల్లి దుర్గాప్రసాద్ నియోజకవర్గ అభివృద్ధికి విశేష కృషి చేస్తున్నాడని, నిధులు విడుదల చేయించి పలు సంక్షేమ కార్యక్రమాలు చేపడుతున్నారని తెలిపారు. అయితే కాంగ్రెస్‌పార్టీకి చెందిన పనబాక కృష్ణయ్య తానే నిధులు తీసుకవచ్చి అభివృద్ధి పనులు జరిపిస్తున్నట్లు చెప్పడం హాస్యాస్పదమన్నారు. గూడూరు నియోజకవర్గంలో నిధులు ఏవైనా శాసనసభ్యుడే తీసుకొని వస్తాడన్నారు. కృష్ణయ్య వీటి విడుదల సమాచారాన్ని ముందుగా కనుగొని ప్రకటనలు చేస్తూ ప్రజలను తప్పుదోవ పట్టిస్తున్నాడని ఆరో



పించారు. ప్రకటనలతో అభివృద్ధి జరగదని నిజంగా నియోజకవర్గ అభివృద్ధికి పాటుపడుతున్న వ్యక్తి ఎమ్మెల్యే బల్లి దుర్గాప్రసాద్ అని స్పష్టం చేశారు. కోట్లాది రూపాయల నిధులతో రోడ్లు, బ్రిడ్జి పనులు చేపడుతున్నట్లు తప్పుడు ప్రకటనలు చేయడం కాంగ్రెస్ పార్టీ వారు మానుకోవాలని హితవు పలికారు. ఈ సమావేశంలో టిడిపికి చెందిన మాజీ కౌన్సిలర్లు మైనంపాటి మోహన్, వాకాటి ప్రభాకర్, వీరుబోయిన వెంకటేశ్వర్లు, రామచంద్రయ్య, మదన్‌మోహన్ తదితరులు పాల్గొన్నారు.

# పల్లెల్లో అస్తవ్యస్థ పరిస్థితులు

## విఫలమైన ప్రత్యేకాధికారుల పాలన

జిల్లాలో గ్రామపంచాయితీల నిర్వాహణకు నియమించిన ప్రత్యేకాధికారులకు పట్టు లేకపోవడంతో పాలన అస్తవ్యస్తంగా మారింది. సమస్యలపై అవగాహన లేకపోవడం, కార్యదర్శుల పని తీరుకుతోడు సిబ్బంది కొరత కారణంగా గ్రామాల్లో పారిశుద్ధ్యం క్షీణించిపోతోంది. పర్యవేక్షించాల్సిన అధికారులు మొక్కుబడిగా సమావేశాలు నిర్వహించి చేతులు దులుపుకొంటుడడంతో ప్రత్యేకాధికారుల పాలన అధ్వాన్నంగా మారింది. జిల్లాలో 961 పంచాయితీలు వుండగా అందులో 447 మంది కార్యదర్శులున్నారు. వీరిలో 138 మంది కాంట్రాక్టు పద్ధతిలో విధులు నిర్వహిస్తున్నారు. రెండు మూడు క్లస్టర్లకు కలిపి కార్యదర్శులను నియమించినా మరో 170 మంది దాకా అవసరం వుంది. ప్రత్యేక అధికారుల పాలనలో గ్రామాల్లో అభివృద్ధి కుంటుపడుతుందనేందుకు తోటపల్లి గూడూరు మండలం ఉదాహరణ. ప్రధాన పంచాయితీలో ఇన్‌చార్జీలు పని చేస్తుండంతో పారిశుద్ధ్యం, వీధిదీపాలు, త్రాగునీటి సమస్య అధికంగా వుంది. గ్రామసభలలో తలెత్తిన సమస్యలు ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్న చందంగా వుంది. చేజర్ల మండలంలో 22 పంచాయితీలకు కేవలం 5 మంది కార్యదర్శులు మాత్రమే వున్నారు. సైదాపురంలో 31 పంచాయితీలకు 11 మంది మాత్రమే వుండగా, జలదంకి మండలం సోమవరప్పాడు కార్యదర్శి అదనంగా ఐదు పంచాయితీలలో విధులు నిర్వహించాల్సి వస్తోంది. వరికుంటపాడు మండలంలో 24 పంచాయితీలకు 8 మంది కార్యదర్శులు పని చేస్తున్నారు. ఆత్మకూరులో 24 పంచాయితీలకు గాను 7 మంది వున్నారు. కార్యదర్శుల కొరత ఒకవైపు, మరొకప్రక్క ప్రత్యేకాధికారులు తగిన శ్రద్ధ వహించకపోవడంతో గ్రామాల్లో అస్తవ్యస్త పరిస్థితులు నెలకొన్నాయి.

# భూకబ్జాలను అడ్డుకోగలరా?

వెంకటగిరి ప్రాంతంలో అధికమవుతున్న భూకబ్జాలను అరికట్టేందుకు ఎట్టకేలకు అధికారులు కదిలారు. నిన్నమొన్నటి వరకు ఈ కబ్జాల గురించి తెలిసినా పట్టనట్లు వ్యవహరించిన అధికారుల్లో చలనం వచ్చింది. దీనికి కారణం కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి వెంకటగిరి వచ్చిన సమయంలో వీటిపై ఆగ్రహం వ్యక్తం చేయడమే. మండలంలోని ఎండ కండ్రిగ గ్రామంలో సర్వే నెంబర్ 148లోని 32 హెక్టార్ల అటవీభూమి వుంది. అందులో అటవీ అభివృద్ధి సంస్థ మొక్కలు పెంచారు. తాజాగా దీనిని కొందరు ఆక్రమించారు. వీరిపై పోలీసులు క్రిమినల్ కేసులు నమోదు చేశారు. కలపాడు, దాచెరువులో 48 ఎకరాల అటవీ పోరంబోకు భూమిని కబ్జా చేసిన వారిపై రెవెన్యూ అధికారులు క్రిమినల్ చర్యలు తీసుకోనేందుకు రంగం సిద్ధం చేశారు. మొగళ్లగుంటలో

## వెంకటగిరిలో కదలిన అధికార గణం

ప్రభుత్వ స్థలాన్ని ఆక్రమించి ఇళ్లు నిర్మించుకొన్న వారికి రెవెన్యూ సిబ్బంది నోటీసులు జారీ చేశారు. వెంకటగిరి పట్టణంలో ఆక్రమణలను గుర్తించిన అధికారులు 144 సెక్షన్ క్రింద నిషేధాజ్ఞలు విధించడంతోపాటు హెచ్చరిక బోర్డులు ఏర్పాటు చేశారు. కలెక్టర్ ఆదేశాలతో కదిలిన అధికారులు భవిష్యత్తులోను ఇలాగే కఠినంగా వ్యవహరించినట్లయితే ఆక్రమణలు వుండవని స్థానికులు వ్యాఖ్యానిస్తున్నారు.

## కాంగ్రెస్ కండువాలతో 'చిరు'తమ్ముళ్లు



ఈసారి అసెంబ్లీ సమావేశాల్లో చిరంజీవితోపాటు ప్రజారాజ్యం ఎమ్మెల్యేలు, ఎమ్మెల్సీలు కాంగ్రెస్ కండువాలను ధరించనున్నారు. ఇప్పటిదాకా అసెంబ్లీలో ప్రజారాజ్యం పార్టీకి ప్రత్యేక ప్రాధాన్యం ఉండేది. ఆ పార్టీ కాంగ్రెస్‌లో విలీనం కావడంతో ఇప్పుడు ప్రజారాజ్యం పార్టీ ఎమ్మెల్యేలకు కూడా కాంగ్రెస్ ఎమ్మెల్యేలతోపాటే కుర్చీలను కేటాయిస్తారు. ప్రజారాజ్యం నాయకుడిగా 'చిరు' ముందు వరసలో కూర్చునేవాడు. ఇప్పుడు పార్టీ ఫిరాయించడంతో చిరు సీటు వెనక్కు వెళ్లిపోతుంది. అంటే ముందు వరసలో కనిపించే చిరు కోసం ఇప్పుడు వెనక బెంచీల్లో వెదుక్కోవాలన్నమాట. ప్చ్! అంతా 'కండువా' మహిమ.




## నిండా మునిగిన శ్రీలక్ష్మి



ఓబులాపురం గనుల మంజూరులో సీనియర్ ఐఏఎస్ శ్రీలక్ష్మి పీకల్లోతు మునిగిపోయారు. శ్రీలక్ష్మి 'చేతివాటం' కారణంగానే గనుల కేటాయింపుల్లో అనేక అవకతవకలు జరిగినట్లు సిబిఐ అధికారులు ఓ నిర్ణయానికి వచ్చారు. దీంతో ఏ క్షణమైనా శ్రీలక్ష్మి అరెస్టు ఖాయమన్నది స్పష్టమైంది. అరెస్టును తప్పించుకోడానికి శ్రీలక్ష్మి చేయని ప్రయత్నం లేదు. చివరకు గుళ్లూ గోపురాల్ని కూడా వదలటం లేదు. ఇటీవల భర్తతో కలసి సూర్య దేవాలయాన్ని సందర్శించారు. హైదరాబాదులోని గుళ్లనూ వదలడం లేదు. పనిలో పనిగా ముఖ్యమంత్రిని కూడా కలసి తన బాధ వెళ్లబోసుకున్నారు. రాజకీయ వత్తిడి కారణంగానే తాను వ్యవహరించానని ఇందులో తన ప్రమేయం ఏదీ లేదంటూ సిఎం దగ్గర కంటనీరు పెట్టుకుందట. అయితే ఈ దశలో తాను చేయగలిగిందేం లేదని, భగవంతుడిపైనే భారం వేయాలంటూ సిఎం బుజ్జగించి పంపాడట. పాపం శ్రీలక్ష్మి.

## సమాచార కమిషనర్లకు యమ డిమాండ్

రాష్ట్ర సమాచార కమిషనర్ పోస్టులకు డిమాండ్ ఎక్కువైంది. గత ఏడాదిగా మూడు కమిషనర్ పోస్టులు ఖాళీగా వున్నాయి. రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి హోదాలో నియామకం అయ్యే ఈ కమిషనర్లకు జీతభత్యాలతోపాటు హోదాకు కూడా కొరతే లేదు. అయిదేళ్లపాటు వుండే ఈ పోస్టుల కోసం మంత్రులు, ఎమ్మెల్యేలు, ఎంపీలు సీరియస్‌గానే సిఫార్సులు చేస్తున్నారు. ప్రతిపక్ష నాయకుడి హోదాలో చంద్రబాబు కూడా కమిషనర్ల ఎంపిక కమిటీలో వుండటంతో కమిషనర్ పోస్టుల్ని ఆశిస్తున్నవారు లోపాయికారిగా బాబును కూడా బతిమాలుకుంటున్నారు. కమిషనర్ పోస్టుల్ని ఆశిస్తున్న వారిలో జర్నలిస్టులతోపాటు మాజీ ఐఏఎస్‌లు కూడా వున్నారు. గత ఏడాది పదవీ విరమణ చేసిన ముగ్గురు కమిషనర్ల పోస్టులతోపాటు మరో ఇద్దరిని కూడా నియమించాలంటూ ప్రధాన సమాచార కమిషనర్ జన్నత్ హుస్సేన్ ప్రభుత్వాన్ని కోరుతున్నారు. త్వరలోనే ఎంపిక కమిటీ సమావేశం జరుగనుండడంతో పైరవీల జోరు ఎక్కువైంది. చూద్దాం... ఎవరు ఎంపిక అవుతారో?

## తెలంగాణకు కాంగ్రెస్ రాంరామ్!

ప్రత్యేక తెలంగాణకు కాంగ్రెస్ దూరంగా జరగనుందా? అవుననే అంటున్నాయి కాంగ్రెస్ వర్గాలు. ఇప్పటిదాకా తెలంగాణపై నోరువిప్పని కాంగ్రెస్‌పార్టీ త్వరలోనే తన నిర్ణయాన్ని ప్రకటించనుంది. రాష్ట్ర క్షేమం దృష్ట్యా సమైక్యాంధ్రకే మొగ్గు చూపాలని కాంగ్రెస్ అధిష్టానం ఇప్పటికే ఓ నిర్ణయానికొచ్చిందట. ప్రస్తుతం పార్లమెంటు సమావేశాలు జరుగుతున్నాయి. కాబట్టి సమయం చూసుకొని నిర్ణయాన్ని వెల్లడించాలని అధిష్టానం ఎదురుచూస్తోంది. రాష్ట్రంలో కూడా ప్రత్యేక తెలంగాణకు కాంగ్రెస్ నుంచి అంతగా అనుకూలత లేదు. తెలంగాణలో కాంగ్రెస్ నాయకుల్లో కొందరు మాత్రం తీవ్రంగా వున్నా... అధిష్టానం ఓ నిర్ణయానికొచ్చిన తర్వాత వారు చేసేదేం వుండదని గాంధీభవన్ వర్గాలంటున్నాయి. ఈలోగా కాంగ్రెస్ నాయకులకు బ్రెయిన్ వాష్ చేసే బాధ్యతను పిసిసి చీఫ్ బొత్సాకు అప్పగించారు. చూద్దాం... ఏం జరుగుతుందో!!

## రేటు పెంచిన బాలయ్య

శ్రీరామరాజ్యం హిట్ కావడంతో హీరో బాలకృష్ణ రేటు పెంచాడట. గత సినిమా సింహా సూపర్ డూపర్ హిట్ తర్వాత ఇప్పుడు శ్రీరామరాజ్యం కూడా అదే దోవలో వుండటంతో బాలయ్య క్రేజ్ బాగా పెరిగింది. దీంతో నిర్మాతలు బాలయ్య ఇంటి ముందు క్యూ కడుతున్నారు. అయితే బాలయ్య తన రెమ్యూనరేషన్ అమాంతంగా పెంచడంతో ఏం చేయాలో పాలుపోక నిర్మాతలు తలపట్టుకుంటున్నారట. బాలయ్య రేటు ఎలా వున్నా ఆయనతో సినిమా తీస్తే హిట్ కొట్టడం ఖాయమంటూ కొందరు పెద్ద నిర్మాతలు మాత్రం 'సై' అంటున్నట్లు భోగట్టా. ప్రస్తుతం మోహన్‌బాబు కూతురు నిర్మాతగా వున్న సినిమాలో ప్రత్యేక పాత్ర వేస్తున్న బాలయ్య ఇక స్పీడ్ పెంచడం ఖాయమంటున్నారు. గతంలో సొంత నిర్మాణసంస్థలో ప్రారంభించిన 'నర్తనశాల' ప్రాజెక్టును చేపట్టడానికి ఎవరైనా ముందుకొస్తే మాత్రం రేటు తగ్గించుకుంటానంటున్నాడట.

# సర్వజీవుల గొప్పదనాన్ని చెప్పే దత్తాత్రేయ అవతారం!



త్రిమూర్తులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల అవతారమే దత్తాత్రేయ అవతారం. మూడు శిరస్సులు, ఆరు చేతులతో కనిపించే దత్తాత్రేయుడు వెనుక ఆవు, ముందు భాగంలో నాలుగు శునకాలు దర్శనం ఇస్తాయి. మూడు ముఖాలు త్రిమూర్తులకు అంశగా, నాలుగు శునకాలు జ్ఞానబోధకాలైన వేదాలకు ప్రతీకలుగా, వెనుక వున్న ఆవు కోరికలను తీర్చే కామధేనువుగా చెప్తారు. త్రిమూర్త్యాకారంలో కొలువై వుండే దత్తాత్రేయస్వామిని అర్చిస్తే కలి ప్రభావం చేత కనిపించే లోపాలు, దోషాలు తొలగి భగవంతుని ప్రాప్తి లభిస్తుందని పురాణాలు చెప్తున్నాయి. మార్గశిర పౌర్ణమి నాడు దత్తుడిని పూజిస్తే విశేష ఫలితం వుంటుందని చెప్తారు.

దత్తాత్రేయుని అవతారానికి సంబంధించి పురాణ కథ ఒకటి వుంది. అత్రి అనే మహర్షి తపో మహిమ చేత అధి భౌతికం, అధి దైహికం, అధ్యాత్మికం అనే మూడు విధాలైన తాపాలను తొలగించుకొని అత్రి అయ్యాడు. ఆయన దుర్గుణాలన్నింటికి మూలమైన అసూయను జయించి అనసూయ పతి అయ్యాడు. అలాంటి మహర్షి ఒకానొక సమయంలో ౠష్యపర్వతంపై సుదీర్ఘ తపస్సు ప్రారంభించాడు. ఆ తపస్సుకు లోకాలన్నీ గజగజలాడాయి. అత్రి మహర్షి తపస్సు చేసినంతకాలం అనసూయ పాతివ్రత్య ధర్మాన్ని పాటిస్తూ ఆశ్రమ ధర్మాన్నీ నిర్విఘ్నంగా సాగించింది. ఆమె పాతివ్రత్య మహిమతో ఏళ్లూ పూళ్లు గడిచినా అత్రి నిరంతరంగా తపస్సు సాగించాడు. ఆయన తపస్సుకు మెచ్చిన త్రిమూర్తులు ప్రత్యక్షమై తమ తేజస్సులతో పుత్రునిగా పుట్టి అత్రి దంపతులకు ఆనందం కల్గిస్తామని చెప్తారు. దానికి సంతోషించిన వారు ఆ




సమయం కోసం ఎదురు చూస్తుంటారు. అలాంటి సమయంలో అనసూయ పాతివ్రత్య మహిమను తెలుసుకొన్న త్రిమూర్తుల భార్యలు ఆమెను పరీక్షించదలచి త్రిమూర్తులను మారు వేషాలలో ఆశ్రమానికి పంపిస్తారు. కొన్ని నియమాలకు కట్టుబడి అతిథి సత్కారం చేయమని కోరగా అసలు సంగతి తెలుసుకొన్న అనసూయ భర్తను ప్రార్థించి కమండలంలోని నీళ్లను త్రిమూర్తులపై చల్లింది. దాంతో ఆ ముగ్గురూ పసి పాపలుగా మారారు. వారు కోరిన విధంగా అతిథిసేవ చేయడంతోపాటు తన స్తన్యం ఇచ్చి పొట్టనింపింది. పాలు త్రాగిన పసివారు నిద్రపోయారు. ఆ సంగతి తెలుసుకొన్న త్రిమూర్తుల భార్యలైన సరస్వతి, లక్ష్మీదేవి, పార్వతిలు వచ్చి క్షమించమని వేడుకొంటారు. తిరిగి వారి రూపాలను పొందిన త్రిమూర్తులు దత్తాత్రేయులుగా మార్గశిరమాస పూర్ణిమ తిథి నాడు అత్రి, అనసూయలకు జన్మించారు. శాండిల్యోపనిషత్తు దత్తాత్రేయుడినే విశ్వగురువుగా పేర్కొంది. ప్రకృతిలోని సర్వజీవుల నుంచి నేర్చుకోవాల్సింది ఎంతో వుందంటూ దత్తాత్రేయ అవతారం చెప్తుంది. ఆయనే శ్రీపాదవల్లభునిగా, నృసింహ సరస్వతిగా, మాణిక్ ప్రభువుగా, షిరిడీ సాయి బాబాగా అవతరించినట్లు చెప్తారు. J

డిసెంబరు 10తేది దత్తాత్రేయ జయంతి సందర్భంగా...

## ట్రంకు రోడ్డు

### వాల్‌పోస్టర్... కటౌట్లు లేవు!



సినిమా విడుదలంటే పబ్లిసిటీ ముఖ్యం. వీటిలో వాల్ పోస్టర్లు, కటౌట్లు, ఫ్లెక్సీలు ప్రముఖపాత్ర పోషిస్తాయి. కాని ఇటీవల నెల్లూరులో ప్రారంభమైన ఎస్-2 మల్టీప్లెక్స్ థియేటర్ల సముదాయంలో ఆడుతున్న సినిమాల పోస్టర్లు థియేటర్ల ముందు ప్రదర్శించడం లేదు. ఇప్పటివరకు కటౌట్లు, ఫ్లెక్సీలకు స్థానం కల్పించ లేదు. టిక్కెట్లు ఇచ్చే క్యాబిన్, తినుబండారాలు అమ్మే స్టాళ్ల ముందు ఏర్పాటు చేసిన టీవీల్లో మాత్రం స్పీడ్‌గా థియేటర్లలో ప్రదర్శిస్తున్న సినిమాల వివరాలు సాగిపోతున్నాయి. దీంతో ఈ మల్టీప్లెక్స్ సముదాయానికి వచ్చే ప్రేక్షకుడు కాస్త గందరగోళం పడక తప్పడం లేదు. నెల్లూరులో మొదలైన ఈ సరికొత్త సినిమా ట్రెండ్‌పై ట్రంకురోడ్డులో విస్తృత చర్చ జరుగుతుంది.

### బండెక్కి వస్తాను... పడవెక్కి వస్తాను!



సీతయ్య సినిమాలోని బండెక్కి వస్తావా... బస్సెక్కి వస్తావా పాట జనాలను బాగా అలరించింది. ఈ పాట జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి కూడా స్ఫూర్తిగా తీసుకొన్నట్లుంది. ఈవారంలో సముద్ర ముఖ ద్వారముండే పల్లెపాళెం గ్రామానికి ఆయన పడవెక్కి దిగి, బండెక్కి వెళ్లి మరీ పరిశీలించారు. బకింగ్ హాం కాలువను దాటను కలెక్టర్ పడవెక్కి, ఇసుక తిన్నెలపై నడవడం కష్టం కావడంతో బండెక్కి గ్రామస్తులను పలకరించి వారి సమస్యలు అడిగి తెలుసుకొన్నారు. ముఖద్వారంలో పేరుకపోయిన ఇసుకతిన్నెల తొలగింపు చర్యలు తీసుకొని ముంపు నుంచి రక్షిస్తానని భరోసా ఇచ్చి వచ్చారు. కలెక్టర్ చిత్రవిచిత్ర పర్యటన ట్రంకు రోడ్డులో చర్చనీయాంశమయ్యింది.

### తేగలు కొండెక్కాయి!



డిసెంబర్, జనవరి మాసాల్లో మార్కెట్‌లోనికి వచ్చే తేగలు ఈసారి నవంబరు రెండవ వారంలో అందుబాటులోనికి వచ్చాయి. అయితే గతంలో నాలుగు తేగలుండే కట్ట ఐదు రూపాయలకు దొరికేది. ఇప్పుడది పది రూపాయలైపోయింది. రేటు పెరిగిన ఈ పసలేని తేగలు కొని తినలేక, కొనకుండా వుండలేక వీటి అభిమానులు రుస రుసలాడుతున్నారు.

### మనీస్కీం ఏజంట్లకు మర్యాదలు!



మనీసర్క్యులేషన్ స్కీంలు నెల్లూరు ప్రజల పుట్టి ముంచాయి. 500కోట్ల ప్రజాధనాన్ని చిన్న ఆశ సాకుగా చూపి హరించాయి. వీరిపై ప్రస్తుతం సిఐడి దర్యాప్తు జరుగుతుంది. స్కీంలో ముఖ్యులతోపాటు పలువురు ఏజంట్లను పోలీసులు అరెస్టు చేశారు. వీరి వద్ద లక్షల్లో డబ్బులుండడంతో వీరికి పోలీసులు ఇంటి అల్లుళ్ల మాదిరి స్టేషన్‌లో సకల మర్యాదలు చేస్తున్నారు. రిమాండ్ విధించి జైలుకు పంపిన వారికి జైలులోపల, కోర్టుకు తీసుకొచ్చే సమయంలో వివిఐపిల ట్రీట్‌మెంట్ ఇస్తున్నారు. ప్రజల కష్టార్జితాన్ని దిగమింగిన దోషులకు ఈ మర్యాదలేమిటి స్వామి?



### వార్తల్లో డిఇఓ

అదేమి విచిత్రమోగానీ డిఇఓ రామలింగం నిత్యం ఏదో ఒక వివాదంలో చిక్కి వార్తల్లో వుంటారు. వివాదంలో లేకుంటే ఆయనకు నిద్ర పట్టేటట్లు లేదు. గతంలో ఎసిబికి చిక్కి సస్పెండ్ అయ్యి మంత్రి టిజి వెంకటేష్ సహకారంతో మళ్లీ వుద్యోగం తెచ్చుకొన్న ఈయనపై కర్నూల్‌లో ఓ టీచర్ తనను కులం పేరుతో దూషించాడని కేసు పెట్టాడు. ఈ కేసు విషయమై రామలింగంను అరెస్ట్ చేయమని హైకోర్టు ఆదేశించింది. డిఇఓగారు మాత్రం తనపై తప్పుడు కేసు పెట్టారని, పెట్టిన వ్యక్తి అసలు ఎస్సీనే కాదంటుండడంపై నలుగురు అయ్యోర్లు ఎక్కడ చేరినా ఈ విషయంపైనే మాట్లాడుతున్నారు.

# వారఫలాలు

తేది 29-11-2011 నుండి 4-12-2011 వరకు తులలో రవి; తుల, వృశ్చికాల్లో బుధ, శుక్రులు; మేషంలో గురువు; కర్కాటకంలో కుజుడు; కన్యలో శని; వృషభంలో కేతువు; వృశ్చికంలో రాహువు; వృశ్చిక, ధనుర్మకర, కుంభాల్లో చంద్రుడు సంచరిస్తారు.


మేషం
అశ్విని, భరణి, కృత్తిక 1 పా

ధన విషయంలో లోటు లేదు. వసతిగృహ మార్పిడులకు అవకాశాలున్నాయి. స్పెక్యులేషన్ లాభిస్తుంది. సోదరులతో గొడవలు తొలగుతాయి. వ్యాపారంలో పోటీనెదుర్కొంటారు. కొత్త ఖాతాదారులు ఏర్పడే అవకాశం కలదు. వాహనాలు రిపేరుకు రావచ్చు. ఉద్యోగులకు ప్రమోషన్ లేదా ఆదాయవృద్ధి వుండవచ్చు. రాజకీయులకు ఉత్తమకాలం. అనుకొన్నవి సాధిస్తారు. వృత్తిపరులు లాభపడతారు.


వృషభం
కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా

సోదరుల మూలంగా శ్రమ. వివిధ మార్పులు జరిగే అవకాశాలున్నాయి. ఆరోగ్య విషయంలో అతిజాగ్రత్త అవసరం. ఆర్థిక లావాదేవీలు మీకనుకూలంగా వున్నందున స్పెక్యులేషన్ లాభించవచ్చు. వ్యాపారులు భాగస్వాములతో జాగ్రత్తగా మెలగాలి. పైవారి ఆదరణతో ఉద్యోగులు లాభపడతారు. భూభవనాల వస్తువాహనాల ద్వారా ఆదాయమార్గాలు సులభతరమవుతాయి.


మిథునం
మృగశిర 3,4 పా. ఆర్ద్ర,పునర్వసు,1,2,3 పా

ఇరుగుపొరుగువారి తోడ్పాటు చక్కగా వుంటుంది. ఆరోగ్యవిషయంలో శ్రద్ధ అవసరం. ఆటంకాలు తొలగుతాయి. శత్రువులు మిత్రులవుతారు. తోటివారు సాయమందిస్తారు. నూతనమిత్రులు ఏర్పడతారు. కీళ్లబాధలుంటాయి. దూరదేశ ప్రయాణావకాశాలు కాన వస్తున్నాయి. వ్యాపార వృద్ధి చక్కగా సాగుతుంది. కొత్త భాగస్వామి లేదా మంచి అనుచరుల మూలంగా లాభపడతారు.


కర్కాటకం
పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష

కళత్ర సంబంధం బాగుండదు. ఉద్యోగంలో నూతన బాధ్యతలధికం. విసుగును తెప్పిస్తాయి. చిరకాలంగా ఎదురు చూస్తూవచ్చిన ధనం ప్రాప్తిస్తుంది. శత్రువుల బాధ వుండవచ్చు. అగ్ని ప్రమాదావకాశాలు జాగ్రత్త. బంధువులకు మీ చేతనైన సహాయం చేస్తారు. వ్యాపారులు కొత్తసంబంధాలు ఏర్పరచుకొంటారు. రాజకీయులకు ప్రోత్సాహకరమైన కాలం. వృత్తిపరులకు కళాకారులకు మంచి ఆదరణ.


సింహం
మఖ, పుబ్బ, ఉత్తర 1 పా

మానసిక వేదన, కొంత ఒత్తిడి తగ్గవచ్చు. స్పెక్యులేషన్ మంచిది కాదు. ఆర్థికవిషయాలు మెరుగుపడవచ్చు. నూతన వస్త్రాభరణాలకై వెచ్చిస్తారు. గృహాలంకరణ విషయాలలో ఆసక్తి చూపుతారు. ఖర్చుకు వెరవరు. విద్యార్థులకు ప్రయోజనవంతమైన కాలం. అన్ని రంగాలలో ముందంజ వేస్తారు. రాజకీయులు పైవారి ఆదరణకు పాత్రులౌతారు. ఉద్యోగులకు పెద్దల తోడుంటుంది.


కన్య
ఉత్తర 2,3,4 పా. హస్త, చిత్త 1, 2 పా

శారీరక శ్రమ, హాస్పిటలైజేషన్ వుంటుంది. సోదరుల మూలంగా ఇబ్బందులుండవచ్చు. ధనవిషయంలో కటకట వుండవచ్చు. ఖర్చులధికం. పనులు నిదానంగా సాగవచ్చు. ఒకటికి రెండుసార్లు ఆలోచించి చేయడం మంచిది. వ్యాపారులకు అమ్మకాలు మెరుగు పడతాయి. ఉద్యోగులకు శ్రమాధిక్యత. పైవారి ఆగ్రహానికి గురౌతారు. విద్యార్థులకు ఒకవిధంగా చదువు సాగుతుంది.


తుల
చిత్త 3,4 పా. స్వాతి, విశాఖ 1,2,3 పా

సంతాన అనారోగ్యం ఆందోళన నిస్తుంది. ధనాదాయం బాగుంటుంది. వ్యాపారులకు భాగస్వాముల మూలంగా మంచి లాభ ప్రాప్తి వుంటుంది. వృత్తిపరులు తమ మూర్ఖత్వవల్ల నష్టపోయే అవకాశాలున్నాయి. ఆచి తూచి అడుగేయాలి. రాజకీయులు లేనిపోని గొడవల్లో చిక్కుకొంటారు. ఉద్యోగులకు శ్రమ అధికం. సరైన ప్రోత్సాహం వుండదు. విద్యార్థులకు వృథా కాలక్షేపం.


వృశ్చికం
విశాఖ 4 పా. అనూరాధ, జ్యేష్ఠ

వృత్తి రీత్యా ఉత్సాహం, శ్రమ, ధనాదాయం అధికమౌతుంది. కళత్ర సుఖం చక్కగా వుంటుంది. సంతానమూలంగా సుఖశాంతులు కాన వస్తాయి. ధనాదాయం చక్కగా వుంటుంది. స్పెక్యులేషన్ కూడా లాభిస్తుంది. రాజకీయులకు అత్యంత అనుకూలమైన కాలం. వ్యాపార విస్తరణ చేస్తారు. విద్యార్థులకు మంచికాలం. వృత్తిపరులకు కీర్తి ప్రతిష్ఠలు పెరుగుతాయి. పౌరసంబంధాలు బాగుంటాయి.


ధనుస్సు
మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా

పొత్తికడుపుకు సంబంధించి ఇబ్బంది వుండవచ్చు. దూరప్రయాణాలు మానుకోవాలి. కళత్ర ఆరోగ్యం జాగ్రత్త. వృత్తిలో మార్పు చేర్పులు. భాగస్వాములు చక్కగా తోడ్పడతారు. నూతన భాగస్వాములు కలిసే అవకాశాలు. దైనందిన కార్యక్రమాలలో ఆటంకాలుండవచ్చు. విద్యార్థులకు చదువు కొంతమేలు. కళాకారులకు ఆశాభంగం. ఉద్యోగులకు శ్రమ తగ్గుముఖం పడుతుంది.


మకరం
ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా

కుటుంబసభ్యులతో సఖ్యత తగ్గుతుంది. సంబంధం లేని విషయాల జోలికి పోకుండడం మంచిది. ఆర్థికవిషయాలు కొంత తృప్తికరంగా వుంటాయి. వ్యాపారులు భాగస్వాములతో సఖ్యంగా వుండడానికి ప్రయత్నించండి. ఆర్థికలావాదేవీలలో జాగ్రత్త. రాజకీయులు తోటి వారి విషయంలో జాగ్రత్తగా వుండాలి. ఉద్యోగులకు పై అధికారుల సాయం చక్కగా లభిస్తుంది. విద్యార్థులు ఉత్సాహంతో ఉరకలేస్తారు.


కుంభం
ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వ భాద్ర 1,2,3 పా

మనశ్శాంతి తక్కువ. సంతానవివాహ విషయంలో కొంత ముందుకు సాగే అవకాశాలున్నాయి. ధన విషయంలో తెలివిగా ప్రవర్తించాలి. ఇరుగుపొరుగువారి సహాయమందవచ్చు. వ్యాపారులు ఖాతాదారులతో జాగ్రత్తగా మెలగాలి. రాజకీయులకు కొంత వెసులుబాటు. దుర్గను, రాహువును కొలవాలి. ఎదురు చూసిన సత్ఫలితాలు దక్కడంలో ఆలస్యం. ఎవరికి ఎలాంటి మాట ఇవ్వవద్దు.


మీనం
పూర్వాభాద్ర 4 పా. ఉత్తరాభాద్ర, రేవతి

మనశ్శాంతి తక్కువ. కుటుంబసభ్యులతో గొడవలు. ఊహించని రీతిలో ధనవ్యయమవుతుంది. వ్యాపారులకు, వృత్తిపరులకు మేలైన కాలం కాదు. గృహిణులకు సంతానమూలంగా మనశ్శాంతి వుండదు. రాజకీయులు జాగ్రత్తగా నడచుకోవాలి. విద్యార్థులకు వృథా కాలక్షేపం. గృహిణులకు అంతగా మేలు ఫలితాలు కానరావడం లేదు. కళాకారులకు మానసిక అశాంతి కొంత తగ్గవచ్చు.

## పంచాంగం

### శుభ ముహూర్తాలు

29, 2తేదీలలో ధనుర్ లగ్నాన ప.10.00 నుండి 12.00 గంటల వరకు.

3తేదీ కర్కాటక లగ్నాన రా.10.00 నుండి 12.00 గంటల వరకు.

4తేదీ మిథున లగ్నాన రా.09.00 నుండి 11.00 గంటల వరకు శుభముహూర్తాలున్నాయి.

### నవంబర్ తిథులు

మార్గశిర శుద్ధ

| | | | |
|---|---|---|---|
| 29 | శని | తదియ | రా 07.37 గం.ల.వ |
| 30 | ఆది | చవితి | సా 05.56 గం.ల.వ |
| 31 | సోమ | పంచమి | ప 04.18 గం.ల.వ |

### డిసెంబర్ తిథులు

| | | | |
|---|---|---|---|
| 1 | మంగళ | షష్ఠి | ప 03.12 గం.ల.వ |
| 2 | బుధ | సప్తమి | ప 02.29 గం.ల.వ |
| 3 | గురు | అష్టమి | సా 04.36 గం.ల.వ |
| 4 | శుక్ర | నవమి | ప 02.41 గం.ల.వ |

పి.ఎం.గోపాలాచారి
16/1020, పొగతోట, నెల్లూరు – 1.
E-mail:maripmgg@yahoo.com

# నక్షత్ర యుక్త వృక్ష పూజా సంవిధానాలు - రోగ నిదానాలు!

*వి.రాజేంద్రకుమార్ నెల్లూరు*

* *నేను నా బయోడేటా పంపిస్తున్నాను. గత పాతిక సంవత్సరాలుగా అనారోగ్యం. విరుగుడు చెప్పగలరా?*

కశ్యప, మాండవ్య వాస్తుశాస్త్రాల్లో మనిషికి, వృక్షాలకు కార్యకారణ సంబంధం వున్నట్లు చెప్పబడింది. మీ ధనిష్ఠా నక్షత్రానికి వృక్షం శమీ(జమ్మి) మీరు మండలం(నలభై) రోజులు వృక్ష ప్రదక్షిణలు చేసి వైద్యుల పర్యవేక్షణలో చెట్టు బెరడు కషాయం వాడి చూడండి.

*దేవుల శంకరరావు హైదరాబాద్*

* *వ్యాపారం ప్రారంభించాక 'కుష్మ' వచ్చింది. అది తగ్గగానే 'కుమారుడు' మరణించాడు. ఎందుకిట్లా?*

నైరుతి వ్యాపార సంస్థ రాహుకేతువులకు కేంద్ర కారకం. అందుకే మీరు రోగగ్రస్థులయ్యారు. అబ్బాయికి వ్యతిరిక్త, వేధోదిశ దక్షిణం అది యమ స్థానం. అందువల్ల మరణం సంభవించింది. వాస్తు శాస్త్రజ్ఞుల సూచనలను తీసుకోకపోవడం వల్లే ఈ అనర్థాలు. ఇలాంటి వారు 'సుదర్శన యంత్ర' ప్రతిష్ట చేసుకోవాలి.

*డి.కె.ఫణీంద్ర సూళ్లూరుపేట*

* *తూర్పు అంగడి. సరికి సరిగా వ్యాపారం జరుగుతోంది. ఎందుకిట్లా?*

తూర్పు ఇంద్రస్థానమైనా, మీకిప్పుడు కేతు విరుద్ధ దశ(నీచం) జరుగుతోంది. అది తమో, చాంచల్య గుణ కారకం. వ్యాధి, ఆకస్మిక సమస్యలు కలుగుతాయి. 'లక్ష్మీగణపతి' యంత్ర ప్రతిష్ట కొంత ఉపశమనాన్ని కలిగిస్తుంది.

*సుంకర ఓబులేసు కర్నూలు*

* *'యంత్ర ప్రతిష్ట' ఏ ఫలితాల్నీ ఇవ్వలేదు. పైగా సమస్యలు ఎక్కువవుతున్నాయి.*

అంగట్లో యంత్రం కొంటే పరిస్థితి ఇట్లాగే వుంటుంది. నామ నక్షత్ర, తేదీ, వ్యాపార సంస్థ వాస్తు గణనలతో యంత్ర బీజాక్షరాలు రాయించి, త్రివిధ పూజలుచేసి, యంత్ర బలి సంప్రోక్షణాదులు జరిపి తర్వాత ప్రతిష్టించుకోవాలి.

*షేక్ నూర్జహాన్ నెల్లూరు*

* *స్త్రీ ప్రసవించిన తర్వాత ఏ గదిలో వుండటం మంచిది?*

దక్షిణ, నైరుతి, వాయువ్య గదులు ఇటువంటి స్త్రీల నివాసానికి మంచివి.

*ఎం.సత్యనారాయణరావు నాయుడుపేట*

* *'మామిడి చెట్టు' తీసివేశాక ఈశాన్యం సౌభాగ్యాన్ని ఇవ్వలేదు. ఆరోగ్యం విషమించింది.*

ఏ చెట్టయినా అది ఫలించడం పూర్తి అయ్యాక, పూజాదికాలు నిర్వర్తించి, కొమ్మలు మాత్రమే ఖండించాలి. వృక్షవేధ మూడు నెలల నుంచి మూడు సంవత్సరాల వరకు ఉంటుంది.

## వాస్తు సందేహాలు సమాధానాలు

ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*పి.దశరధరామయ్య సూళ్లూరుపేట*

* *పొలాలు, ఇతర ఆస్తుల ప్రభావాలు కూడా యజమానిపై ఉంటాయా?*

తప్పక ఉంటాయి. లోపాలు సవరించుకోవడం పొలాలు, బయలు స్థలాలు కాబట్టి 'దిష్టి' తీయించి, 'రుద్రాక్ష' మూల అక్కడ చెట్టుకు తగిలిస్తే ఆ దోషం పోతుంది.

*కటికం నరసయ్య వింజమూరు*

* *వ్యతిరేకులు 'చేతబడి' చేయించారని అనుమానం. మేము ఏ పూజ చేయించుకోవాలి?*

ఏ పూజలూ అవసరం లేదు. నరసింహస్వామి ఫోటో దేవుడి గదిలో ఉంచి మండలం (నలభై) రోజులు ప్రతిరోజూ రెండు నిమ్మకాయలు నైవేద్యం పెట్టండి. 'సుదర్శన యంత్ర' ప్రతిష్ట చేసుకొని, మూల మంత్రాన్ని రోజుకు నూట ఒక్కసార్లు ఉచ్చరించండి. ఫలితం ఉంటుంది.

*బి.సుందరరామయ్య గూడూరు*

* *పొలాల్లో నీళ్లెక్కడున్నాయో వాస్తు శాస్త్రం చెబుతుందా?*

'జలనిధి' ప్రకరణమని వాస్తులో ఒక అధ్యాయమే వుంది. శోధనకు మూడు వారాలు, మూడు పర్యాయాలు పరీక్షలు చేయాలి.

*ఆర్.తిరుపతి శాస్త్రి సూళ్లూరుపేట*

* *స్తంభాలు, దూలాలు జాయింట్ చేయవచ్చునా?*

గృహ నిర్మాణంలో స్తంభాలు, దూలాలు, ఇనుప కమ్ములు రెండింటిని కలపకూడదు. అతుకు వేయకూడదని 'కృష్ణవాస్తు' చెబుతోంది.

# ఉన్నతాధికారుల తీరుకు క్రిందిస్థాయి సిబ్బంది బలి!

**పోలీసు శాఖలో సిఐ, ఎస్ఐ స్థాయి అధికారులు చేసే తప్పులకు కానిస్టేబుళ్లను బలి చేయడం చర్చనీయాంశమయ్యింది. ఈ విషయమై ఎస్పీని కలసి మాట్లాడేందుకు పోలీసు అధికారుల సంఘం సిద్ధమయ్యింది.**



వార్తల్లో నెల్లూరు ట్రాఫిక్ పోలీసు స్టేషన్.

అధికారులు చేసే తప్పులకు క్రిందిస్థాయి ఉద్యోగులు బలికాక తప్పడం లేదు. ఉన్నతాధికారులు తీసుకోబోయే చర్యల నుంచి తప్పించుకొనేందుకు వారు చేసిన పొరపాట్లను సిబ్బందిపై నెట్టేస్తున్నారు. ఈ తంతు దాదాపు అన్ని ప్రభుత్వ శాఖల్లోనూ జరుగుతుంటుంది. ఏ తప్పు చేయకుండా అధికారుల ఆదేశాలు పాటిస్తూ విధి నిర్వహణలో ఉన్న సిబ్బంది తమకు జరుగుతున్న అన్యాయం గురించి బయటకు చెప్పుకోలేకపోతున్నారు. క్రమశిక్షణకు మారుపేరుగా భావించే పోలీసు శాఖలోనే ఇటువంటి సంఘటనలు చోటుచేసుకోవడం వివాదాస్పదంగా మారింది.

పోలీసు శాఖలో ఏ స్థాయి వారైనా తప్పు చేస్తే కఠినంగా వ్యవహరించాల్సి ఉంటుంది. అయితే ఇటీవల జరిగిన ఒక సంఘటన బట్టి చూస్తే తప్పు చేయించిన అధికారిని వదిలి కిందిస్థాయి ట్రాఫిక్ కానిస్టేబుల్‌ను సస్పెండ్ చేశారు జిల్లా ఎస్పీ. నెల్లూరు నగరంలోని ప్రధాన కూడళ్లలో ట్రాఫిక్ ఎస్ఐలు, సిఐలు వాహనాలను నిలిపి ధృవ పత్రాలు, లైసెన్సులు లేనివారికి జరిమానాలు విధించి చలానా రాస్తుంటారు. కొన్ని సందర్భాల్లో ఎస్ఐ, సిఐలు వాహనంలో కూర్చొని కానిస్టేబుళ్ల చేత చలానాలు వ్రాయిస్తుంటారు. ఇలా రాయడం పెద్ద తప్పేమీ కాదని వారే వ్యాఖ్యానిస్తుంటారు. చలానా పుస్తకాల్లో కానిస్టేబుళ్లు సంతకాలు చేసి నగదు వసూలు చేస్తే తప్పని భావించవచ్చు.

కేవలం చలానా వ్రాశాడన్న కారణంతో కానిస్టేబుల్‌ను సస్పెండ్ చేయడం పట్ల పోలీసు శాఖలో పెద్ద చర్చ జరుగుతుంది. చలానా పుస్తకాల్లో సిఐ స్థాయి అధికారి సంతకాలుంటాయి. ఎస్ఐలకు కూడా సంతకాలు చేసే అవకాశం ఉండదు. ట్రాఫిక్ విధుల్లో వున్న కానిస్టేబుళ్లు పైఅధికారుల మాట వినక తప్పదు. ఈ క్రమంలో కిందిస్థాయి పోలీసులు తప్పు చేశారని భావించి చర్యలు తీసుకోవడం ఎంత వరకు సమంజసమో ఆ శాఖ ఉన్నతాధికారికే తెలియాలి. ట్రాఫిక్ సిఐకు ఛార్జిమెమో జారీచేసి, కానిస్టేబుల్‌ను వెంటనే సస్పెండ్ చేయడంపై ట్రాఫిక్ కానిస్టేబుళ్లు అసంతృప్తి వ్యక్తం చేస్తున్నారు.

గతంలో సిటీ బస్సుల నుంచి అధికంగా మామూళ్లు ఇవ్వాలని డిమాండ్ చేసిన అప్పటి ట్రాఫిక్ సిఐ సుబ్బరాజు ఎసిబి అధికారులకు పట్టుబడ్డాడు. ఈయన ఆగడాలు భరించలేక బస్సు యాజమాన్యాలు ఎసిబికి సమాచారం అందించాల్సి వచ్చింది. ప్రస్తుతం ట్రాఫిక్‌లో విధులు నిర్వహించే ఎస్ఐ, సిఐలకు క్రమం తప్పకుండా ఎవరి వాటా వారికి అందిస్తుంటారు. నగరంలో రాకపోకలకు ఎటువంటి అంతరాయం ఏర్పడకుండా చూడాల్సిన వీరు వాహనాల నుంచి జరిమానాలు వసూలు చేసేందుకే పరిమితమై పోయారు. ట్రాఫిక్ కానిస్టేబుళ్ల పనితీరును సంబంధిత ఎస్ఐలు నిత్యం పర్యవేక్షించాల్సి ఉంటుంది. కానీ వీళ్లు హోటళ్లు, బార్లు ఉన్న కూడళ్లలోనే దర్శనమిస్తుంటారు. అవినీతి ఆరోపణలు ఎదుర్కొంటున్న ఎస్ఐలు, ఎఎస్ఐలపై చర్యలు తీసుకోవడం లేదు. ఎస్పీ క్రిందిస్థాయి సిబ్బందిపై తీసుకుంటున్న చర్యలపై అసోసియేషన్ నేతలు ఆయన్ను కలిసి చర్చించనున్నట్లు తెలిసింది. ◆J

**ఉత్తుత్తి పథకం**

# ఉత్తుత్తి మరుగుదొడ్ల పథకం!

**బడుగు, బలహీన వర్గాల వారికి మరుగుదొడ్లు నిర్మించేందుకు ప్రభుత్వం ప్రవేశపెట్టిన పథకం జిల్లాలో నీరుగారి పోయింది. గత పదేళ్లుగా ఈ ప్రహసనం కొనసాగుతూనే వుంది.**

జిల్లావ్యాప్తంగా బడుగు, బలహీన వర్గాల వారికి మరుగుదొడ్లు నిర్మించేందుకు ప్రవేశపెట్టిన పథకం నీరుగారిపోతుంది. గత పదిసంవత్సరాల నుంచి ఈ పథకం అమల్లో వున్నప్పటికి అధికారుల నిర్లక్ష్యం కారణంగా 50శాతం కూడా నిర్మించలేకపోయారు. ప్రభుత్వ లెక్కల ప్రకారం ఈపాటికి జిల్లాలోని అన్ని గ్రామాల్లో మరుగుదొడ్ల నిర్మాణం పూర్తికావాల్సి వుంది. ఈ పథకం అమలు చేసే బాధ్యతలను తీసుకున్న అధికారులు ప్రచారం చేసి గ్రామీణప్రాంత ప్రజలకు అవగాహన కల్పించి మరుగుదొడ్ల నిర్మాణం చేపట్టాల్సి వుంది.

బహిరంగ ప్రదేశాల్లో మలవిసర్జన చేయడం సాంఘిక దురాచారం అంటూ రాష్ట్రప్రభుత్వం ప్రతి ప్రభుత్వ కార్యాలయంలో పెద్ద వాల్‌పోస్టర్లను ఏర్పాటు చేసింది. ఈ వాల్‌పోస్టర్లను చూసి చదివేందుకు మాత్రమే ఏర్పాటు చేసినట్లు కనిపిస్తుంది తప్ప ఆచరణలో అమలు చేసేందుకు కృషి చేయలేకపోతోంది. తాగునీరు – పారిశుధ్యమిషన్ విభాగం ఆధ్వర్యంలో మరుగుదొడ్ల నిర్మాణ పథకం అమలు చేసే బాధ్యతలను గ్రామీణ నీటిసరఫరా విభాగానికి ప్రభుత్వం అప్పగించింది. ఈశాఖ సూపరింటెండెంట్ ఇంజనీరు మంజూరు ఉత్తర్వులు అందజేస్తారు. మండలకేంద్రాల్లో ఈశాఖకు సంబంధించి అసిస్టెంటు ఇంజినీర్లు గ్రామీణప్రాంతాల్లోని లబ్దిదారుల వివరాలు సేకరించి ప్రతిపాదనలు పంపాల్సి వుంటుంది.

మరుగుదొడ్ల నిర్మాణానికి ప్రభుత్వం 3,500 రూపాయలు నిర్ణయించింది. ఇందులో లబ్దిదారుడు 700రూపాయలు భరించాలి. మిగిలిన నగదు తాగునీరు–పారిశుధ్యమిషన్ చెల్లిస్తుంది. గ్రామీణప్రాంతాల్లో మరుగుదొడ్ల సౌకర్యం లేక తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. ప్రభుత్వం ప్రవేశపెట్టిన పథకం కేవలం కాగితాలకే పరిమితమైంది. అధికారులు చెబుతున్న లెక్కలకు, వాస్తవ పరిస్థితులకు చాలా వ్యత్యాసం కన్పిస్తుంది. ఇందిరమ్మ పథకం క్రింద మంజూరు చేసిన పక్కా గృహాల లబ్దిదారులు మొదట్లో కొంతమేర మరుగుదొడ్లు నిర్మించుకున్నారు. ఇందిరమ్మ పథకం కూడా సక్రమంగా కొనసాగకపోవడంతో అసంపూర్తిగానే నిర్మాణాలు మిగిలిపోయి అధికారుల తీరును వెక్కిరిస్తున్నాయి.

ఈ పథకం అమలు కోసం నిధులకొరత లేదని ఒకప్రక్క ప్రకటిస్తూనే గతంలో లబ్దిదారులు సొంతంగా నిర్మించుకున్న వాటికి బిల్లులు ఇవ్వకుండా తీవ్ర జాప్యం చేస్తున్నారని వాపోతున్నారు. గ్రామీణ ప్రాంతాల్లో ప్రధానంగా మహిళలు బహిర్భూమికి వెళ్లేందుకు నానా ఇక్కట్లు పడాల్సి వస్తుంది. ప్రభుత్వ పథకం గురించి పూర్తిగా వివరించి నిధులు మంజూరు చేస్తే ప్రతిఒక్కరు మరుగుదొడ్లు నిర్మించుకొనేందుకు ముందుకు వస్తారు. ఇందుకు అందించే నగదు తక్కువ మొత్తంగా వున్నా నెలల తరబడి కార్యాలయాల చుట్టూ తిప్పుకుంటున్నారన్న ఆరోపణలు వున్నాయి. ఈ పథకం అమలు చేసే విభాగం అధికారులు, సిబ్బంది ఏం చేస్తున్నారన్న ప్రశ్న తలెత్తుతుంది.

ఒక మంచి లక్ష్యంతో ప్రవేశపెట్టిన పథకానికి తూట్లు పడకుండా చూడాల్సిన ప్రజాప్రతినిధులు సైతం పెద్దగా పట్టించుకోవడం లేదు. సంక్షేమ పథకాల అమలుపై ప్రత్యేకదృష్టి సారించిన జిల్లా కలెక్టర్ తాగునీరు– పారిశుధ్యమిషన్ విభాగం పనితీరుపై కూడా పర్యవేక్షణ చేసి పథకం పటిష్టంగా అమలు చేసేందుకు కృషి చేస్తే బాగుంటుంది. ◆J

# చూడాల్సిన చిత్రరాజం... శ్రీరామరాజ్యం!




✍ అల్లూరు రహీం

మధురం... సుమధురం... మహిమాన్వితం శ్రీరాముని చరితం. ఈ సుందర కావ్యాన్ని ఎన్నిసార్లు తెరపై చూపించినా ఇంకా ఏదో కొత్త కోణం ఉంటూనే ఉంటుంది. కోదండరాముడి కథను దర్శకుడు బాపు గతంలోనూ తెరకెక్కించారు. పౌరాణిక చిత్రాలుగానే కాదు. ఆయన సాంఘిక కథల్లోనూ అంతర్లీనంగా రామాయణ ప్రభావం వుంటుంది. స్వతహాగా శ్రీరామభక్తుడైన బాపు ఈసారి 'శ్రీరామరాజ్యం' చిత్రాన్ని కూడా కడు రమ్యంగా తీసి తన సత్తాను చాటారు. శ్రీరామరాజ్యం అద్భుతంగా రూపొందను ఖర్చుకు వెరవకుండా చిత్రాన్ని తీసిన నిర్మాత యలమంచిలి సాయిబాబాను ముందు అభినందించాలి. ఆ తర్వాత ఈ చిత్రానికి అందరికీ అర్థమయ్యేలా స్క్రీన్‌ప్లేతో పాటు మాటలు వ్రాసిన స్వర్గీయ ముళ్లమూడి రమణను స్మరించుకోవాలి. మళ్లీ మళ్లీ వినాలనిపించేలా పాటలు వ్రాసిన జొన్నవిత్తుల రామలింగేశ్వరరావు, వీటికి వీనుల విందైన సంగీత బాణీలందించిన మాస్ట్రో ఇళయరాజా, మనమిప్పుడు త్రేతాయుగంలో వున్నామా అన్నంతగా భ్రమించేలా కెమెరా పనితనం చూపిన జి.ఆర్.కె.రాజు, ఆశ్చర్యపోయేలా సెట్టింగులు వేసిన కళాదర్శకుడు రవీందర్ కృషిని అభినందించకుండా వుండలేం. రామోజీ ఫిల్మ్ సిటీలోని 'మంత్ర' విభాగంలో పురుడు పోసుకొన్న కీకారణ్యం, నిజమైన జింకల్లా భ్రమింపజేసే గ్రాఫిక్ జింకలు, నెమళ్లు, సెలయేళ్లు, భూమి బ్రద్ధలైపోవడాలు, మహాస్త్రాల ప్రయోగం తెరపై చూడాలేగాని వ్రాతలో వ్రాయలేం. రఘుకుల వంశజుడు సూర్యనారాయణుడు, శ్రీరామచంద్రుని దర్బార్, ఏకాంత మందిరం, శయన మందిరం, పుష్పక విమానం, ఆనాటి వీధుల సెట్టింగులు సినిమా చూసే ప్రేక్షకులను సంభ్రమాశ్చర్యాలకు గురి చేస్తాయి.




సుస్వరం, సశాస్త్రీయ సంగీతం మేలు కలయికలో రూపుదిద్దుకొన్న జగదానంద కారక, గాలి నింగి నీరు, సీతా... సీమంతం, ఎవడున్నాడీ లోకంలో, దేముళ్లే మెచ్చింది చరణాలతో సాగే పాటలను ఎన్నిసార్లు విన్నా మళ్లీ వినాలనిపిస్తాయి. పాటలన్నింటినీ 80 సంవత్సరాల వయస్సులోనూ పాత డ్యాన్స్ డైరక్టర్ శ్రీను పర్యవేక్షణలో దర్శకుడు బాపు అద్భుతంగా తెరకెక్కించాడు. లవకుశులు గానం చేసే 'దేముళ్లే మెచ్చింది' పాటకు కూర్చిన నృత్యరీతులు అద్భుతం. రమణ వ్రాసిన కథ కోసం కష్టాలొద్దు. నాకు సుఖపడే రాత లేదు... నేను కష్టాలకే పుట్టాను. ముద్దుకొర్రలారా, రామబాణం... రామతేజం. సత్యాన్ని దాచి పెట్టడం అసత్యంకన్నా ఘోరం వంటి మాటలు అందరినీ అలరిస్తాయి. చిత్రం చివరన లక్ష్మణ, లవకుశ సంవాదంలో ఒక పద్యం పెట్టి ఉంటే బాగుండేది. సినిమా మొత్తంమీద నాలుగు పద్యాలే ఉండడం పద్యాభిమానులను నిరాశ పరుస్తుంది. లవకుశ కథలోనే తయారైన ఈ చిత్రంలో శ్రీరాముని పాత్రధారిగా బాలకృష్ణ నటన కొన్ని సన్నివేశాల్లో గతంలోకన్నా మెరుగ్గా కనిపించినా కొన్నిచోట్ల ఆయన ముఖారవిందం నీలమేఘశ్యామంలో అంతగా నొప్పలేదు. మేకప్ లేని సీతాదేవి పాత్రలో నయనతార ఒదిగిపోయింది. ఆమె సినీజీవితంలో ఇటువంటి పాత్రనే పోషించ లేదనాలి. చిత్రంలో అతిముఖ్యమైన వాల్మీకి పాత్రలో మహానటుడు అక్కినేని నాగేశ్వరరావు నుంచి ఇంకా మెరుగైన నటనను బాపు ఎందువల్ల రాబట్టలేక పోయారో అర్థం కావడం లేదు. లక్ష్మణుని పాత్రధారి శ్రీకాంత్‌కు ఈ పాత్ర పోషణ కష్టమయ్యింది. లవకుశులుగా మాస్టర్ తన్యతేజ, మాస్టర్ సాత్విక్‌లు అదరగొట్టేశారు. కుశుడుగా సాత్విక్ ముద్దుగొలిపేలా వున్నాడు. కౌసల్యగా కెఆర్‌విజయ, ఆంజనేయునిగా ధారాసింగ్, జనకునిగా మురళీమోహన్ తమ పాత్రలకు బాగా సరిపోయారు.

చిత్రకథ అందరికీ విదితమే. రావణ సంహారం తర్వాత శ్రీరాముడు (బాలకృష్ణ)అయోధ్య నగరానికి సీతా సమేతంగావస్తాడు. ఓరోజు శయన మందిరంలో సీతాదేవి (నయనతార)తాను గర్భవతినన్న విషయం కొంటెగా నీల మేఘశ్యామునికి చెబుతూ తాను ఓసారి మునిపత్నుల ఆశీర్వాదం పొందను మునిపల్లెకు పోయివస్తానంటుంది. ఇంతలో వచ్చిన వేగు భద్రుడు (నవభారత్ బాలాజీ) తాను నగరంలోని చాకలివాడలో తిప్పడు(బ్రహ్మానందం) నోటి ద్వారా విన్న మాట చెబుతాడు. అంతే శ్రీరామచంద్రుడు సీతాదేవిని మునిపల్లెలో వదలి రమ్మని లక్ష్మణుడు (శ్రీకాంత్)ను ఆదేశిస్తాడు. కారడవిలో ఈ విషయం తెలుసుకొని సీతాదేవి తల్లడిల్లిపోతుంది. నిండు చూలాలైన ఆమెను అప్పటికే రామాయణాన్ని రచించిన వాల్మీకి మహాముని (అక్కినేని నాగేశ్వరరావు) ఆదరిస్తాడు. ఆమెకు పుట్టిన కవలలకు కుశలవులుగా నామకరణం చేయడంతో పాటు వారిని చిన్న వయస్సులోనే అన్ని విద్యలలో ఆరితేరేలా చేస్తాడు. రామాయణ గాథను ఆలపిస్తూ అయోధ్యకు వెళ్లే కుశలవులు అక్కడ సీతా దేవిని చూడాలని శ్రీరామచంద్రుని అడుగుతారు. ఆయన ఆమె లేదని జరిగిన వృత్తాంతం చెప్పేసరికి రామభద్రుని నిందించి వనానికి తిరిగి వచ్చేస్తారు. ఇంతలో అశ్వమేధ యాగం ప్రారంభమవుతుంది. యాగాశ్వాన్ని లవకుశులు నిర్బంధించడం లక్ష్మణస్వామిని మూర్ఛిల్లేలా చేయడం శ్రీరామునితోనే యుద్ధానికి తలపడడం, సీతాదేవి వచ్చి నిలువరించి లవకుశులను తండ్రి అక్కున చేర్చి తాను తన తల్లి భూమాతతో కలసి పాతాళానికి వెళ్లిపోవడంతో చిత్రం ముగుస్తుంది.



## విడిపోతేనేం?

బాలీవుడ్ తారల ప్రేమాయణాలు ఎప్పుడూ హాట్‌హాట్‌గా వుంటాయి. రోజుకో జంట ప్రేమకు శ్రీకారం చుడుతుంటే పాత జంట విడిపోతుంటుంది. ఈ విడిపోయిన జంటలు వ్యక్తిగతంగా మాట్లాడుకోకపోయినా వృత్తిపరంగా మాత్రం దూరంగా వుండలేమని చెబుతున్నారు. సల్మాన్‌ఖాన్ – కత్రినాకైఫ్‌ల జంట విడిపోయింది. అయినా బాడీ గార్డ్ చిత్రంలో ఓ పాటలో కలసి నటించారు. ఇటీవలే విడిపోయిన జాన్ అబ్రహాం, బిపాసా బసు కూడా రేస్–2 చిత్రంలో నటించను ఒప్పుకొన్నారు. ఒకరి మొహం ఒకరు చూసుకొనేందుకు ఇష్టపడని ఈ జంట కలసి ఎలా నటిస్తుందబ్బా అనే సందేహం పరిశ్రమకు వచ్చింది. ఇదివరకు ఈ జంట పలు వ్యాపార ప్రకటనల్లో కలసి నటించారు. పెద్దమొత్తాలు పారితోషికాలుగా అందుకొన్నారు. ఉన్నట్లుండి విడిపోతే ఆర్థికపరమైన ఇబ్బందులు తలెత్తే అవకాశం వుందని తాము ప్రకటనల్లో నటిస్తున్నామని చెప్పుకొంటున్నారు. రణబీర్–దీపికా జంట విడిపోయి చాలా రోజులైంది. ఇప్పుడు వీరిద్దరు కలసి నటించను ఓకే చెప్పారు. మొత్తానికి సినీ జంటలు వృత్తివేరు, వ్యక్తిగతం వేరని చాటడం చర్చనీయాంశమయ్యింది.

## ప్రేమించడం తప్పా?



తెలుగులో ఒకే ఒక్క చిత్రం 'ఒక్కమగాడు'లో హీరోయిన్‌గా నటించిన నిషా కొఠారీ బాలీవుడ్‌లో మాత్రం రామ్‌గోపాల్‌వర్మ ఫ్యాక్టరీలో చేరి రాణించింది. ఈ మధ్య చిత్రాలు లేని ఆమెకు కొత్త కష్టాలొచ్చాయి. కన్న తల్లిదండ్రులు ఆమెను ఇంటి నుంచి పంపేశారు. దీనికి కారణం ఆమె ప్రేమ వ్యవహారమే. ప్రస్తుతం నిషా ఓ నేవీ అధికారిని ప్రేమిస్తుంది. అతను తమ కులస్తుడు కాదని, అందువల్ల వారి ప్రేమను అంగీకరించలేమని నిషా తల్లి దండ్రులు తేల్చి చెప్పారు. ఆమె తాలుకు డబ్బు, కారు కూడా లాక్కొన్నారట. ఎవరు ఏమన్నా ఏమి చేసినా తాను మాత్రం ప్రేమించిన వాడినే పెళ్లి చేసుకొంటాననంటుంది నిషా కొఠారీ.

## విలన్‌గా అర్జున్



మాపల్లెలో గోపాలుడు, మన్నెంలో మొనగాడు చిత్రాల్లో హీరోగా తెరంగేట్రం చేసిన అర్జున్ పలు తమిళ, కన్నడ చిత్రాల్లోనూ నటించారు. తమిళ చిత్రాలు జెంటిల్‌మెన్, ఒకేఒక్కడు ఆయనకు ఎంతో గుర్తింపు తెచ్చాయి. ఆ మధ్య హనుమాన్ జంక్షన్‌లోనూ నటించి మంచి క్రేజ్ తెచ్చుకొన్నారు. 47ఏళ్ల ఈ హీరో వయసుకు తగ్గ పాత్రల్లో నటించాలని నిర్ణయించుకొన్నాడట. మణిరత్నం దర్శకత్వంలో ఓ ప్రేమ కథాచిత్రం రూపొందబోతోంది. ఈ చిత్రంలో అన్వేషణ ఫేం మురళి కుమారుడు హీరో. ఈ సినిమాలో విలన్‌గా నటించను అర్జున్ ఒప్పుకొన్నాడు. త్వరలోనే ఈ చిత్రం సెట్స్ మీదకు వెళ్తుంది.

## శ్రీదేవి రికార్డు!



14ఏళ్ల తర్వాత శ్రీదేవి మళ్లీ వెండితెరపై దర్శనమివ్వబోతుంది. 'ఇంగ్లీషు వింగ్లీష్' సంఖ్యాపరంగా ఆమె నటించే 265వ చిత్రం. బాలీవుడ్‌లో మరే ఇతర హీరోయిన్ కూడా ఇన్ని సినిమాల్లో నటించలేదు. అందుకే ఈ చిత్రం ఆమె కెరీర్‌లో అద్భుతంగా నిలవాలని శ్రీదేవితో పాటు దర్శకురాలు గౌరి ఎంతో తపిస్తున్నారు. ఆమె అభినయం కూడా కొత్తగా చూపించే ప్రయత్నం చేస్తున్నామంటుంది చిత్ర బృందం. అమెరికాలో ఈ చిత్రం షూటింగ్ జరుగుతుంది. కీలకభాగం అక్కడే తెరకెక్కిస్తారు. ఓ సాధారణ మహిళ అమెరికా ఎందుకు వెళ్లింది? ఇంగ్లీషు రాకుండా ఎన్ని అవస్థలు పడింది? ఎలా నేర్చుకొంది అనే అంశాలతో అల్లుకొన్న వినోదాత్మక కథ ఇది.



## తలవంచను

విమర్శలకు భయపడను. ఎవరో ఏదో అంటారని, అన్నారని... వాటి గూర్చి ఆలోచించను. ఏ పని చేసినా నూరుశాతం ఆత్మ విశ్వాసంతో చేస్తానంటుంది హీరోయిన్ అసిన్. మనం వెళ్లే దారిపై నమ్మకం లేనప్పుడు ఇలాంటి అనవసర భయాలు ఎదుర్కోవలసి వస్తుందని చెబుతోంది. ప్రస్తుతం దక్షిణాదిన అవకాశాలు రాకపోవడంతో బాలీవుడ్‌పైనే ఆధారపడిపోయింది. తాను తప్పులే చేయనని చెప్పనని, తప్పోఒప్పో వచ్చే ఫలితానికి తానే బాధ్యురాలంటుంది. ఈ మధ్యే కొచ్చిలో సముద్రం ప్రక్కన కొన్న ఫ్లాట్‌కు తీరిక దొరికినప్పుడల్లా వెళ్లి గడుపుతున్నానంటుంది. వచ్చే ఏడాది ఓ తెలుగు, మరో తమిళ చిత్రంలో నటించే అవకాశాలున్నాయంది.

# దెబ్బతినిపోయిన రోడ్లు!

**• జనం బాధలు పట్టేదెవరికి?**

రోడ్ల నిర్మాణాల్లో నాణ్యతా ప్రమాణాలకు తిలోదకాలు ఇవ్వడంతో అవి వేసిన నెలలలోపే గుంటలు పడిపోతున్నాయి. జిల్లాలో ఆర్ అండ్ బి, పంచాయితీరాజ్ శాఖలు కోట్లాది రూపాయల వ్యయంతో రోడ్డు నిర్మాణ పనులు చేపడుతున్నా పర్యవేక్షణ లేకపోవడం, నాణ్యత కొరవడడంతో వేసిన కొద్ది కాలానికే రోడ్లు రూపురేఖలు కోల్పోతున్నాయి. జిల్లావ్యాప్తంగా పంచాయితీరాజ్ శాఖ పరిధిలో 5564.64 కిలోమీటర్ల నిడివిగల గ్రామీణ రహదారులున్నాయి. వీటిలో సిమెంట్ రోడ్లు 356.07 కిలోమీటర్లు, తారురోడ్లు 1070.43 కిలోమీటర్ల పొడవున, మెటల్ రోడ్లు 760.43 కిలోమీటర్లు, గ్రావెల్ రోడ్లు 3377 కిలోమీటర్ల పొడవున ఉన్నాయి. ఆర్ అండ్ బి పరిధిలో 3514.52 కిలోమీటర్ల పొడవున ఉన్నాయి. వీటిలో బ్లాక్ టాపింగ్ రోడ్లు 2891.50 కిలోమీటర్లు, మెటల్ రోడ్లు 556 కిలోమీటర్ల పొడవుకు పైగా ఉన్నాయి. ఈ రోడ్లన్నింటినీ నాబార్డు, ప్రధాన మంత్రి గ్రామీణ సడక్ యోజన తదితర పథకాల క్రింద చేపడుతున్నారు. రోడ్ల నిర్మాణంలో నాణ్యత కొరవడడం వల్ల రోడ్లు దెబ్బతింటున్నాయనే విమర్శలు ఎదురౌతున్నాయి. నిబంధనలకు అనుగుణంగా రోడ్డు నిర్మాణం నాలుగు లేయర్లుగా వేయాలి. ఇవేమీ పాటించకుండా తారు కలిపిన కంకరను పోసుకొంటూ రోలర్‌తో చదునుచేసి ఆఖరున ఇసుకచల్లి రోడ్డు పని అయిపోయిందనిపిస్తుంటారు. దీంతో పది కాలాలపాటు చెక్కుచెదరకుండా ఉండాల్సి రోడ్లు మూన్నాళ్లకే దెబ్బతిని పోతున్నాయి. దీనికి ఉదాహరణ ముత్తుకూరు రోడ్డు, నగరంలోని ప్రధాన రోడ్డును చెప్పొచ్చు. బొల్లినేని హాస్పిటల్ వద్ద పూర్తిగా రోడ్డు దెబ్బతినడంతో నడవడమే కష్టతరంగా మారింది. ప్యాచ్ వర్కులు తూతూ మంత్రంగా చేపడుతుండడంతో అవి రెండు రోజులకే యధాస్థితికి చేరుకొంటున్నాయి.



బాగా దెబ్బతినిపోయిన నెల్లూరు - బుచ్చి రోడ్డు.

# వరాహాల స్వైరవిహారం

**● ఉదాసీనంగా కార్పొరేషన్ అధికారులు!**



నెల్లూరులో ఎక్కడచూసిన వరాహాల మందలే.

నగరంలోని వివిధ ప్రాంతాల్లో పందుల సంచారం అధికంగా ఉంటోంది. గుంపులు, గుంపులుగా ఇవి తిరుగుతుండడంతో అసలే అధ్వాన్నంగా ఉన్న పారిశుద్ధ్యం మరింతగా క్షీణిస్తోంది. వేదాయపాళెం, జనశక్తినగర్, చంద్రమౌళినగర్, జ్యోతినగర్, అయ్యప్పగుడి, ఆటోనగర్, ఇండస్ట్రియల్ ఎస్టేట్ తదితర ప్రాంతాలలో విచ్చలవిడిగా పందులు తిరుగుతుండడంతో ప్రజలు అనారోగ్యం పాలవుతామేమోనని ఆందోళన చెందుతున్నారు. భారీ శరీరాలతో తిరిగే పందులు పాదచారులు, వాహనాలపై వెళ్లే వారిపై దాడి చేస్తుండడంతో ప్రజలు భయాందోళనలు వ్యక్తం చేస్తున్నారు. కొందరు పందుల పెంపకం దారులు వీటిని జనావాసాల మధ్య, ఖాళీ స్థలాల్లోకి తోలి గమ్మునుండడంతో విచ్చలవిడి వాతావరణం నెలకొనింది. సీజనల్ వ్యాధులు, విషజ్వరాల బారిన పడుతున్న నగర వాసులకు పందుల స్వైరవిహారం మరింత గగుర్పాటు కల్గిస్తోంది. ఇటీవల వేదాయపాళెం, ఇండస్ట్రియల్ ఎస్టేట్ వద్ద గర్భం దాల్చిన పందులు దాడి చేయడంతో కొందరు స్థానికులు గాయపడ్డారు. ఇలాంటి ఘటనలు అధికమవుతున్నా, పందుల సంచారం అధికమైనా మునిసిపల్ అధికారులు పట్టించుకోకపోవడంతో ప్రజల ఆరోగ్యానికి రక్షణ లేకుండా పోయింది. పందుల్ని పట్టించాల్సిన మునిసిపల్ సిబ్బంది, హెల్త్ ఆఫీసర్లు ఆ సంగతే పట్టనట్లు వ్యవహరిస్తుండడంతో పందుల పెంపకందారులు ఇష్టానుసారంగా ప్రవర్తిస్తున్నారు.

# నెల్లూరుకు అనంతరాము!

**● కరవు మండలాల పరిశీలనే లక్ష్యం!**

జిల్లాలో కరవు నెలకొన్న ప్రాంతాలను పరిశీలించేందుకు రాష్ట్ర ప్రభుత్వం సీనియర్ ఐఎఎస్ అధికారి అనంతరామును ప్రత్యేకాధికారిగా నియమించింది. ఈయనకు గతంలో మన జిల్లా కలెక్టర్‌గా పనిచేసిన అనుభవముంది. లైలా తుఫాన్ సంభవించినప్పుడు కూడా జిల్లాలో జరిగిన నష్టాలను అంచనా వేసేందుకు ప్రత్యేకాధికారి హోదాలో పర్యటించారు. జిల్లా పరిస్థితుల గురించి క్షుణ్ణంగా తెలిసిన అధికారి కావడం వల్ల ప్రభుత్వం అనంతరామును ప్రతిసారి జిల్లా ప్రత్యేకాధికారిగా నియమిస్తూ వస్తుంది. ఇటీవల జిల్లాలో తొమ్మిది మండలాలను ప్రభుత్వం కరవు మండలాలుగా ప్రకటించింది. వీటి విషయమై విమర్శలు రేగాయి. జిల్లాపై ఈయనకు అవగాహన ఉన్న దృష్ట్యా కరవు మండలాల్లో పర్యటించి నివేదిక సమర్పిస్తే రైతులకు లబ్ధిచేకూర్చేందుకు ప్రభుత్వం చర్యలు తీసుకుంటుంది.

# బాలకార్మిక వ్యవస్థ నిర్మూలనకు శ్రీకారం!

బాల కార్మిక వ్యవస్థ నిర్మూలనకు కేంద్రం శ్రీకారం చుట్టింది. పాఠశాలలకు వెళ్లాల్సిన బాల బాలికలు వివిధ కారణాల వల్ల దుకాణాలు, బార్లు, హోటళ్లలలో కార్మికులుగా పనిచేస్తున్నారు. ఉచిత నిర్బంధ విద్య హక్కు చట్టం అమల్లోకి రావడంతో బాల కార్మిక వ్యవస్థకు కేంద్ర ప్రభుత్వం మార్గదర్శకాలకు జారీ చేయడం జరిగింది. స్త్రీ, శిశు అభివృద్ధి సంస్థ, సాంఘిక సంక్షేమం, గిరిజన సంక్షేమ శాఖ,

## చిత్తశుద్ధి కృషి జరగాలి

జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థ, పోలీసు శాఖలతోపాటు మరో నాలుగు శాఖలను ఒకే వేదికపైకి తీసుకువచ్చి స్వచ్ఛంద సంస్థల సహకారంతో బాలకార్మిక వ్యవస్థ నిర్మూలనకు కృషి చేయాలని ఉత్తర్వులందాయి. ఇందుకు కార్మిక శాఖ అధికారులు కూడా ప్రణాళికను రూపొందించే పనిలో నిమగ్నమైనారు. క్షేత్రస్థాయిలో పరిశీలన జరిపేందుకు జాతీయ స్థాయిలో వివిధ హోదాల్లో పనిచేసి పదవీ విరమణ చేసిన వారి సలహాలను తీసుకుంటారు. త్వరలో జిల్లాలోని స్వచ్ఛంద సంస్థల ప్రతినిధులతో సమావేశం నిర్వహించి కార్యాచరణను ఖరారు చేయనున్నారు.

# రెడ్‌క్రాస్‌లో చెద పురుగులు

**• ఏరిపారవేయాల్సిన బాధ్యత కలెక్టర్ గారిదే!**




వివాదాలకు కేంద్ర బిందువుగా మారిన రెడ్‌క్రాస్ స్పాస్టిక్ సెంటర్.

సేవాభావంతో పనిచేయాల్సిన నెల్లూరు రెడ్‌క్రాస్ సంస్థ వర్గపోరుకు తోడుగా ఆధిపత్య చెలాయింపుతో పరిస్థితి అస్తవ్యస్తంగా తయారయ్యింది. పలు విభాగాలలో సేవలందిస్తున్న సంస్థలో కొందరు వ్యక్తుల ప్రవర్తన కారణంగా నిర్వహణపై తీవ్ర ప్రభావం చూపుతోంది. రెడ్‌క్రాస్ పరిధిలో బ్లడ్‌బ్యాంక్, స్పాస్టిక్ సెంటర్, జూనియర్ రెడ్‌క్రాస్, యూత్ రెడ్‌క్రాస్ తదితర తొమ్మిది విభాగాలున్నాయి. రెడ్‌క్రాస్ సెక్రటరీ దూడూ బసవన్న కావడం, ఎవరి మీదా పట్టులేకపోవడంతో బ్లడ్‌బ్యాంక్ కన్వీనర్‌గా వ్యవహరించే వ్యక్తిది ఇష్టారాజ్యం అయ్యింది. ఆ విభాగంతోపాటు అన్నింటినీ తన కనుసన్నల్లో ఉంచుకొని సిబ్బందిపై అజమాయిషీ చేస్తూ తనకు జీహుజూర్ అనని వారిని వేధింపులకు గురి చేస్తుండడంతో సేవా సంస్థ భ్రష్టుపట్టి పోతోంది. నోరు తెరిస్తే అసభ్య పదజాలం ఉపయోగిస్తూ అవహేళనగా మాట్లాడుతుండడంతో కొన్నేళ్లుగా బ్లడ్ బ్యాంకుకు తమ వంతు సహకారం అందిస్తున్న పలువురు ఆవేదన చెందుతున్నారు. ఇటీవల స్పాస్టిక్ సెంటర్‌లో నిఘా కెమెరాలను బిగించడం తీవ్ర విమర్శలకు తావిస్తోంది. మానసిక వికలాంగులకు చికిత్స చేసే ఈ విభాగంలో అసలు సిసి కెమెరాలు బిగించాల్సిన అవసరం ఏమి వచ్చిందో ఎవరికీ అంతు పట్టడం లేదు. సిబ్బంది కార్యకలాపాలను పర్యవేక్షించడానికి వేలాది రూపాయలు వెచ్చించి కెమెరాలు ఏర్పాటు చేయాల్సిన అవసరం ఉందా? అనేది పలువురిని వేధిస్తున్న ప్రశ్న. స్పాస్టిక్ సెంటర్ కన్వీనర్‌కు తెలియకుండా కెమెరాలు ఏర్పాటు చేయడంతో ఆలస్యంగా తెలుసుకొన్న ఆ మహిళా కన్వీనర్ అయోమయానికి గురయ్యిందట. గత కొన్నేళ్లుగా సొంత డబ్బులు వెచ్చించి రక్తదాన శిబిరాలు నిర్వహిస్తున్న ఒక యువకుడిని నానా రకాలుగా వేధించడంతో అతను ఆ మాటలు పడలేక ఇన్నాళ్లుగా చేస్తున్న సేవను వదలలేక మనోవేదన అనుభవిస్తున్నాడు. వికలాంగుడైనప్పటికీ ఆ యువకుడు చేసే రక్తదానం, శిబిరాల నిర్వహణను పలువురు కలెక్టర్లు, అధికారులు మెచ్చుకొని ఉన్నారు. బ్లడ్‌బ్యాంకులో రక్తం నిల్వలు అంతో ఇంతో ఉంటున్నాయంటే అతని కృషేనన్నది జగమెరిగిన సత్యం. సిబ్బంది పట్ల, ఉన్నత వ్యక్తుల పట్ల ఇలాగే అవమానకరంగా వ్యవహరిస్తుండడంతో పలు సమావేశాలలో గొడవ జరిగినా అతని ప్రవర్తనలో మార్పులేదు. చివరకు ఆ కన్వీనర్ క్యాన్సర్ హాస్పిటల్‌ను తన గుప్పిట పెట్టుకోవాలని చూస్తే వారు తీవ్రంగా వ్యతిరేకించిన దాఖలాలు ఉన్నాయి. ఇతని ప్రవర్తనను సెక్రటరీ చూసీచూడనట్లు ఉండడంతో కలెక్టర్ అయినా జోక్యం చేసుకొని సరిదిద్దాలని పలువురు కోరుకొంటున్నారు.



సినిమా పితామహుడు ఎం.ఎస్.రెడ్డి మనుమరాలు, అంటే అరుంధతి వంటి అద్భుత చిత్రాలను నిర్మించిన ఎం.శ్యామ్‌ప్రసాద్‌రెడ్డి తనయ దీప్తి వివాహం, వెంకట్‌తో నవంబర్ 6తేది హైదరాబాద్‌లోని ఎన్ కన్‌వెన్షన్ సెంటర్‌లో వైభవంగా జరిగింది. మొత్తం తెలుగు సినిమా పరిశ్రమ అంతా అక్కడ గుమికూడిందంటే అతిశయోక్తి కాదు.

## ఆనం బ్రదర్స్‌కు సమన్లు

16వ పేజీ కొరవ

ఘర్షణ జరిగింది. కాంగ్రెస్ కార్యకర్తలు రిగ్గింగ్‌కు పాల్పడుతున్నారని అప్పుడు తెలుగుదేశంలో వున్న ఆనం రమణారెడ్డి ఆగం చేశాడు. దానికి కోపగించిన వివేకా, రామనారాయణరెడ్డిలిద్దరూ అతడి మీద దాడి చేశారు. పక్కనే వుండిన చవక కర్రలు తీసుకొని చావబాదారు. దానితో రమణారెడ్డి త్రీ టౌన్ పోలీసు స్టేషన్‌కు వెళ్లి ఫిర్యాదు చేశాడు. అది తెలిసి అన్నదమ్ములిద్దరూ తాము ఎమ్మెల్యేలమన్న విచక్షణ కూడా వదలి, వీధి రౌడీల మాదిరి పోలీసు స్టేషన్ మీదకు దాడికి వెళ్లారు. ఆ దృశ్యాలను చిత్రీకరించిన పత్రికా విలేకరులను కూడా కర్రలతో కొట్టారు. దీనిపై అటు ఆనం రమణారెడ్డి ఇటు పత్రికా విలేకరులు రెండు కేసులు పెట్టారు. ఆ తర్వాత వచ్చిన రాజకీయ ఒత్తిడి తట్టుకోలేక పత్రికా విలేకరులు కేసును వదులుకొన్నారు. కానీ ఆనం రమణారెడ్డి మాత్రం వదలి పెట్టలేదు.

కానీ అన్నదమ్ములిద్దరూ రాజకీయంగా బలవంతులు కావడంతో పోలీసులు ఆ కేసును ఏ మాత్రం కదిలించలేదు. దానితో రమణ, హైకోర్టుకు వెళ్లాడు. కేసుపై విచారణ జరపమని హైకోర్టు ఆదేశించింది. దానితో మేజిస్ట్రేట్ కోర్టులో కేసు నమోదు చేసి వదలి పెట్టేశారు. కోర్టుకు హాజరు కావాలని వివేకా, రామనారాయణరెడ్డిలకు ఎన్నిసార్లు మేజిస్ట్రేట్ సమన్లు జారీ చేసినా, పోలీసులు వాటిని పట్టించుకోలేదు. ఎమ్మెల్యేలిద్దరూ తమకు దొరకడం లేదని కోర్టుకు విన్నవించి, కాలయాపన చేశారు. ఆ విషయాన్ని రమణారెడ్డి మరొకసారి హైకోర్టు దృష్టికి తీసుక వెళ్లాడు. దానిపై ఈ కేసును ఆరు నెలల లోపల విచారణ పూర్తి చేయాలని స్పష్టమైన ఆదేశాలిచ్చింది హైకోర్టు. దానితో రామనారాయణరెడ్డి ప్రభుత్వంలో తనకున్న పలుకుబడి ప్రయోగించి, ఈ కేసును ఉపసంహరిస్తున్నట్లు ఒక జిఓ విడుదల చేయించాడు. దానితో ఆనం రమణారెడ్డి మళ్లీ హైకోర్టు గుమ్మం తొక్కాడు. ఇట్లా కేసును ప్రభుత్వ ఉత్తర్వు ద్వారా ఉపసంహరించడం అన్యాయమని విన్నవించాడు. దానిపై హైకోర్టు ఇది తన పరిధిలోకి రాని అంశమని, సంబంధిత పబ్లిక్ ప్రాసిక్యూటర్, మేజిస్ట్రేట్‌లు తమ విచక్షణతో దీనిపై నిర్ణయం తీసుకోవచ్చునని ఆదేశాలు జారీ చేసింది.

మొన్న 21తేదీ మేజిస్ట్రేట్ కోర్టులో ఈ కేసు విచారణకు వచ్చింది. ప్రభుత్వం కేసును ఉపసంహరించుకోవాలంటే, సంబంధిత పబ్లిక్ ప్రాసిక్యూటర్ అనుమతి వుండాలట. అయితే ఈ ఉపసంహరణ జిఓతో తనకు సంబంధం లేదని, తాను అనుమతి ఇవ్వలేదని, వేరే కోర్టుకు చెందిన పబ్లిక్ ప్రాసిక్యూటర్ చేత నివేదిక తెప్పించుకొని, జిఓ జారీ చేశారని ఈ కోర్టుకు చెందిన పిపి నాగేశ్వరరావు మేజిస్ట్రేట్‌కు విన్నవించాడు. చట్టం ప్రకారం సంబంధిత పిపి అనుమతి లేకుండా జారీ చేసిన జిఓ కాబట్టి, దాన్ని పరిగణనలోకి తీసుకోవాల్సిన అవసరం లేదని మేజిస్ట్రేట్ నిర్ణయం ప్రకటించారు. కేసు విచారణ మొదలు పెట్టడానికి, 30తేదీ ఆనం వివేకానంద రెడ్డి, ఆనం రామనారాయణరెడ్డి కోర్టుకు హాజరు కావాలని ఆదేశిస్తూ, వారికి అసెంబ్లీ కార్యదర్శి ద్వారా సమన్లు పంపిణీ అయ్యేట్లు చూడాలని ఉత్తర్వు చేశారు.

తామెంత ప్రయత్నం చేసినా కోర్టు విచారణ ఎదుర్కోక తప్పలేదన్న నిజాన్ని జీర్ణించుకోవడం ఆనం సోదరులకు అలివి కావడం లేదు. ఇక న్యాయస్థానాల ద్వారా ఈ కేసును తప్పించుకోవడం అసాధ్యమనే ఉద్దేశ్యంతో కాళ్ల బేరానికి దిగజారి పోయారు. మద్రాసులోని ఆనం రమణారెడ్డి సమీప బంధువును సంప్రదించి, దీన వదనంతో, చెమ్మగిల్లిన కళ్లతో, ఈ చీకాకు వదిలించమని వేడుకొన్నారట. కానీ కొన్నేళ్లపాటు అధికారం వుందికదా అనే అహంకారంతో నానా హింసలు పెట్టి, ఇప్పుడు అవసరం వచ్చేసరికి బుడి బుడి ఏడ్పులు ఏడిస్తే కరిగి నీరై పోవడానికి నేనేమీ వెన్నముద్దను కానని తేల్చి చెప్పేశాడు ఆనం రమణారెడ్డి.

చట్టం ప్రకారమైతే రేపు 30తేదీ ఆనం సోదరులిద్దరూ కోర్టు ముందు హాజరు కావాలి. దీన్ని తప్పించుకోవడానికి వారు ఇంకే రకమైన న్యాయ ప్రక్రియను ఆశ్రయిస్తారో తెలియదు.

## బోల్తా కొట్టిన చంద్రబాబు

మొదటి పేజీ కొరవ

పరిస్థితి చంద్రబాబుకు కూడా దాపురించింది. సాధారణ ప్రజలకు హైకోర్టు ఆదేశాలలోని సాంకేతిక అంశాలు తెలియవు. అర్థం కావు. వారికి తెలిసిందల్లా జగన్ వలెనే చంద్రబాబు కూడా అవినీతికి పాల్పడ్డాడు కాబట్టే హైకోర్టు ఆయన మీద కూడా విచారణ జరిపిస్తున్నదన్న భావం. తాను ఆంధ్రప్రదేశ్ అన్నా హజారే అన్న ప్రచారం చేసుకొంటుండిన చంద్రబాబుకు దిమ్మతిరిగిపోయే దెబ్బ ఇది. జనం రెండు కేసుల మధ్య తేడాను పట్టించుకోవడం లేదు. ఇద్దరూ ఒకటే అన్న తీరులో మాట్లాడుతున్నారు.

మరొక ప్రక్క సిబిఐ, ఎన్‌ఫోర్స్‌మెంట్ డైరక్టరేట్, రాష్ట్ర విజిలెన్స్, పోలీస్ విభాగాలు ఎవరికి వారుగా ఈ కేసులో హైకోర్టుకు నివేదికలు సమర్పించవలసి వస్తున్నది. జగన్ విషయంలో ప్రాథమిక ఆధారాల నిర్ధారణ ఒక్క సిబిఐకి మాత్రమే పరిమితమైంది. ఇన్ని నేర పరిశోధనా సంస్థలు నివేదికలివ్వడమంటే పెద్ద చీకాకు క్రింద లెక్క. రానున్న మూడు నాలుగు వారాలు చంద్రబాబుకు కానీ, ఆయనతో సహ నిందితులుగా పేర్కొన్న కంపెనీ యాజమాన్యాలకు కానీ వీరి ప్రశ్నలకు సమాధానాలివ్వడంతోనే కాలం గడిచి పోతుంది. ఎవరే కాగితం అడుగుతారో తెలియదు. ఏ ప్రశ్నలు వేస్తారో తెలియదు.

కాంగ్రెస్ నుంచి విడిపోవాలని నిర్ణయించుకొన్న సమయంలోనే జగన్ తనకు సిబిఐ వంటి ఇబ్బందులు కావచ్చునన్న ఆలోచనలో పడ్డారు. దానికి అనుగుణంగా తన లెక్కాపక్కలు, చట్టపరమైన నిబంధనలు సరి చేసుకొన్నాడు. దొరకకూడదనుకొన్న పత్రాలకు పాతర వేశాడు. అన్ని కోణాలలో న్యాయ నిపుణులు, చార్టెడ్ అకౌంటెంట్లు, కంపెనీ సెక్రటరీలను సంప్రదించి, పక్కాగా ఆత్మరక్షణ వ్యూహం రచించుకొన్నాడు. భారతి సిమెంట్ కంపెనీ అమ్మివేశాడు. సాక్షి పత్రికలో తన పేరు తొలగించి తన సతీమణిని ఛైర్మన్‌గా నియమించాడు. ఎంత వెతికినా ఏమీ దొరకని రీతిలో తన ఇళ్లన్నీ చక్కబెట్టుకొన్నాడు. ఒక్కమాటలో చెప్పాలంటే సిబిఐ సోదాల కోసం సిద్ధంగా ఎదురు చూస్తూ ఉండినాడు జగన్.

కానీ చంద్రబాబుకు, ఆయన బృందానికి మాత్రం ఇది ఉరుములేని పిడుగు. ఎప్పుడో పది పన్నెండేళ్ల క్రితం జరిగిన ప్రభుత్వ వ్యవహారాలపై ఇప్పుడు వివరణ ఇవ్వడం అంత సులభం కాదు. అనాటి అధికారులు ముప్పాతిక భాగం మంది రిటైర్ అయిపోయారు. ఆ ఫైళ్లు ఎక్కడున్నాయో ఎవరికీ తెలియదు. వాటిమీద వివరణ ఇచ్చుకొనే బాధ్యత తనపై పడడం చంద్రబాబుకు చీకాకు కల్గించే అంశం.

రేపటి ఎన్నికలలో తనకు కాంగ్రెస్ కంటే తెలుగుదేశం పార్టీ నుంచే అధిక సమస్య అన్న భావన జగన్‌లో ఉంది. తనకు నిజమైన ప్రత్యర్థి చంద్రబాబే అన్న అభిప్రాయం ఉంది. దానితో తెలుగుదేశం పార్టీని ఇరకాటంలో పెట్టి ఆత్మరక్షణలో పడేయడానికి తన కళ్లు పొడిచిన వేలితోనే బాబు కన్నూ పొడవడానికి పకడ్బందీ వ్యూహం పన్నాడు జగన్. వైఎస్ విజయమ్మ పిటిషన్ ద్వారా అత్యంత సమర్థవంతంగా రాజకీయ ప్రయోజనం పొందుతున్నాడు. ప్రజల దృష్టిలో అవినీతి అనేది రెండు పక్కలా ఉందన్న నిర్ధారణ కల్గించాడు. రేపటి ఎన్నికలలో తానొక్కడే అవినీతి పరుడన్న నిందను భరించవలసిన అగత్యాన్ని తప్పించుకొన్నాడు. చంద్రబాబు నాయుడును ఇంతగా బోల్తా కొట్టించడం అంటే, ఎంత మేధాశక్తి కావాలి? జగన్‌కు తెలివి లేదని భావించే ఆదినారాయణరెడ్డి వంటి వారే తెలివి తక్కువ వారని దీనర్థం.

## నెల్లూరు ముచ్చట్లు

3వ పేజీ కొరవ

గీటురాయి పరీక్షగా కోవూరు ఉపఎన్నిక పరిణమిస్తుంది. అందువల్ల అన్ని జాగ్రత్తలూ తీసుకోవాలన్న ఆలోచన వారిలో వుంది. అభ్యర్థి గట్టివాడై వుండాలన్నది మొదటి జాగ్రత్త. దానికోసం, తెలుగుదేశం జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డిని బలిపీఠంపై నిలబెడుతున్నారు. ఆయనైతే అందరినీ కలుపుకొని పోతాడన్న భావనతో ఈ నిర్ణయం తీసుకొన్నారు. జిల్లా నాయకత్వం ఒక్కొక్కసారి ఎంత ప్రమాదకరంగా పరిణమిస్తుందో చంద్రమోహన్ రెడ్డికి అనుభవానికి వస్తున్నదిప్పుడు. ఎక్కడ ఎప్పుడు ఏ స్థానానికి అభ్యర్థి దొరకకపోయినా చంద్రమోహన్ రెడ్డి పేరే ప్రతిపాదిస్తున్నాడు చంద్రబాబు. ఈయనా కాదనలేక పోతున్నాడు.

కాంగ్రెస్ పరిస్థితి అధ్వాన్నం చతుర్మధ్యంగా వుంది. నేదురుమల్లి జనార్దనరెడ్డి జిల్లా పెత్తనం నుంచి పక్కకు తప్పుకోవడంతో, జిల్లాలో కాంగ్రెస్ పార్టీ నాథుడులేని అనాథగా వుంది. జనార్దనరెడ్డి స్థానానికి తాను సహజ వారసుడనని ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి అభిప్రాయం. అయితే, సీటు ఆక్రమించుకో గలుగుతున్నాడు కానీ, దాన్ని నిర్వహించే అనుభవం, అవగాహన ఆయనకింకా అలవడలేదు.

## నెల్లూరు ముచ్చట్లు

3వ పేజీ కొరవ

ఆయన్ను నారాయణ ఆస్పత్రికి తరలించారు. మొదట గుండెపోటు అనుకొన్నా తర్వాత మెదడులో రక్తప్రసరణ లేకపోవడంతో బ్రెయిన్ స్ట్రోక్‌గా వైద్యులు నిర్ధారించి ఇంటెన్సివ్ యూనిట్‌లో ఉంచి చికిత్స చేసి డిశ్చార్జ్ చేశారు. బిపి, షుగర్ అధికంగా ఉండడమే ఈ స్ట్రోక్‌కు కారణంగా వైద్యులు చెప్తున్నారు.

## స్వామిదాస్ స్కూల్ పూర్వ విద్యార్థుల కలయిక!

నెల్లూరు నగరంలోని స్వామిదాస్ ఇంగ్లీష్ మీడియం స్కూల్‌లో 1986 సంవత్సరంలో పదవ తరగతి చదివిన పూర్వ విద్యార్థులు 12వ తేది స్కూల్ ఆవరణంలో తిరిగి కలిశారు. ఇప్పటి వారి ఉన్నత స్థానాలకు ఆనాటి గురువులు మిసెస్ స్వామిదాస్, రాధ, సుబ్బలక్ష్మి, కుమారి కారణమని వారిని ఘనంగా సన్మానించి వారి ఆశీస్సులు పొందారు. చిన్ననాటి జ్ఞాపకాలను తలచుకొని మురిసిపోయారు. ఈ కార్యక్రమంలో ఇప్పటి స్కూల్ కరస్పాండెంట్ వనజ, పూర్వ విద్యార్థులు సాయిశ్రీనివాస్, సిల్వర్ ప్యాలెస్ ధర్మేంద్రజైన్, కె.రాజేష్, హరీష్, బ్రహ్మానందరెడ్డి, రాకేష్ చౌదరి, కోమల విలాస్ అన్నపూర్ణ, పద్మజ, గీత, చంద్రావతి, సింధురెడ్డి పాల్గొన్నారు. ప్రతి ఏడాది పూర్వ విద్యార్థులు కలుస్తుండాలని తీర్మానించారు.

## వైద్యాధికారులకు మెమోలు

విధి నిర్వహణలో నిర్లక్ష్యం వహించినందుకు జిల్లా వైద్య ఆరోగ్య శాఖాధికారి మాశిలామణి పలువురు వైద్యాధికారులకు మెమోలు జారీచేశారు. ఇటీవల కలెక్టర్ జిల్లాలో పలు ప్రభుత్వ వైద్యశాలలను తనిఖీ చేయగా వైద్యులు అందుబాటులో లేకపోవడంతో ఆగ్రహించిన కలెక్టర్ వారికి మెమోలు ఇవ్వాలని ఆదేశించారు. దీంతో సైదాపురం, ఈశ్వరవాక, ముత్తుకూరు, కసుమూరు, మనుబోలు, కలిగిరి, ఇస్కపాళెం పిహెచ్‌సి వైద్యాధికారులకు, కోవూరు కమ్యూనిటీ హెల్త్ సెంటర్ వైద్యాధికారికి మెమోలు జారీ చేశారు.

## పాదయాత్రకు మద్దతుగా పూజలు

వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ నేత కోటంరెడ్డి శ్రీధర్ రెడ్డి చేపట్టిన మహాపాదయాత్రకు మద్దతుగా ఆయన అభిమానులు పూజలు నిర్వహించారు. పార్టీ నేత గుండాల మధుసూదన్‌రెడ్డి ఆధ్వర్యంలో టెక్కేమిట్ట అమ్మవారి గుడిలో 141 టెంకాయలు కొట్టి శ్రీధర్ రెడ్డి చేపట్టిన యాత్ర విజయవంతమవ్వాలని ఆకాంక్షించారు. ఈ కార్యక్రమంలో అశోక్, రమేష్, కిషోర్, స్థానిక మహిళలు 141 మంది పాల్గొనడం విశేషం.

## నేత్రదానం

ఫత్తేఖాన్‌పేటకు చెందిన నలగండ్ల వెంకట శేషమ్మ నేత్రదానం చేశారు. అక్టోబర్ 3న ఆమె మరణించగా వారి కుటుంబసభ్యులు ఆమె కోరిక మేరకు పిఠారామ్ చారిటబుల్ ట్రస్టుకు సమాచారం అందించడంతో వైద్యులు వచ్చి శేషమ్మ నేత్రాలను సేకరించారు. మరణానంతరం మరికొందరికి చూపు ఇచ్చేందుకు కృషిచేసిన శేషమ్మ అభినందనీయురాలు.

## అధిక ధరకు అమ్మితే లైసెన్సు రద్దు

జిల్లాలో మద్యం షాపుల యజమానులు మద్యాన్ని అధిక ధరలకు విక్రయిస్తే లైసెన్సులు రద్దు చేయడంతోపాటు లక్ష రూపాయలు జరిమానా విధిస్తామని ప్రొహిబిషన్ అండ్ ఎక్సైజ్ జాయింట్ కమిషనర్ నాగేశ్వరరావు హెచ్చరించారు. భక్తవత్సల నగర్‌లో గల ఎక్సైజ్ శాఖ ప్రధాన కార్యాలయంలో ఆయన మద్యం ధరలపై అధికారులతో సమీక్షించారు. ఎమ్మార్పీ ధరకే విక్రయించాలని హైకోర్టు ఆదేశాలు జారీచేసి ఉన్నారు. ఆ అధికారి చుట్టు ప్రక్కల ఉన్న షాపులను పరిశీలించి ఉంటే ఎంత ఎక్కువకు అమ్ముతున్నారో తెలిసి ఉండేది.

## • కోటి రూపాయల

# ప్రభుత్వ భూమిని కొట్టేసిన పాత తహశీల్దార్!

> బోగోలు మండల తహశీల్దార్‌గా పనిచేసిన లలితారాణి గ్రామంలోని సర్వే నెం.50-1లోగల 4 ఎకరాల 99 సెంట్ల సీలింగ్ భూమిని బినామీ పేర్లతో పొంది ఇప్పుడా భూమిని కోటి రూపాయలకు అమ్ముకొనే యత్నం చేస్తుంది.

కంచే చేనుమేసిన చందంగా వుంది బోగోలు మండలంలో భూముల వ్యవహారం. గతంలో ఈ మండలంలో ఎమ్మార్వోగా పనిచేసిన లలితా రాణి ప్రభుత్వభూమిని అక్రమంగా స్వాధీనం చేసుకోవడంపై గత కొంతకాలంగా గగ్గోలు రేగుతోంది. దీనిపై ప్రతిపక్ష పార్టీలు, ప్రజాసంఘాలు పలుమార్లు అధికారుల దృష్టికి తీసుకెళ్లినా ఫలితం లేకుండా పోయింది. ఈ పరిస్థితుల్లో ఇటీవల మండల కేంద్రానికి వచ్చిన కావలి శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు స్వయంగా ఈ భూముల అక్రమాలు, అవకతవకలకు పాల్పడిన అధికారిణి గురించి వ్యాఖ్యానించడం సంచలనం కల్గించింది. దీనికి సంబంధించిన వివరాలు ఇలా వున్నాయి.

బోగోలు మండల తహశీల్దార్‌గా గతంలో పని చేసిన లలితారాణి గ్రామంలో సర్వేనెంబర్ 50-1లో గల 4 ఎకరాల 99 సెంట్లు సీలింగ్ భూమిని బినామీ పేర్లతో పట్టా పొందింది. గుట్టుచప్పుడు కాకుండా సాగిన ఈ వ్యవహారం ఆమె మండలం నుంచి బదలీ అయి వెళ్లిన తర్వాత వెలుగు చూసింది. ప్రభుత్వ భూమిని ఆక్రమణల చెరచిక్కకుండా కాపాడి పేదలకు, అర్హులైన వారికి దక్కేలా చూడాల్సిన అధికారే స్వయంగా అక్రమాలకు పాల్పడి కాజేయడం తీవ్ర దుమారం రేపింది. దీనిపై పలు ఫిర్యాదులు అందినా ఎవరూ పట్టించుకోలేదు. ఈ నేపథ్యంలో ఆ అధికారి తను అప్పనంగా బినామీ పేర్లతో స్వాహా చేసిన 4 ఎకరాల 99సెంట్ల సీలింగ్ భూమికి మంచి ధర పలకడంతో కోటి రూపాయలకు అమ్మడానికి బేరం పెట్టింది. ఈ విషయం అటు తిరిగి ఇటు తిరిగి ఎమ్మెల్యే మస్తాన్‌రావు దృష్టికి రావడంతో దీనిపై ఆయన తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేశాడు. బోగోలు తహశీల్దార్ కార్యాలయానికి వచ్చిన ఆయన అధికారులను ఈ భూముల వ్యవహారమై నిలదీశాడు. పేదలకు భూములు పంచేందుకు మండలంలో భూముల విషయమై ప్రశ్నిస్తే సెంటుభూమి లేదన్న అధికారులు, బినామీ పేర్లతో భూమిని దక్కించుకొని కోటిరూపాయలకు బేరం పెట్టడం దారుణమన్నారు. తాను ఎమ్మెల్యేగా బాధ్యతలు చేపట్టిన నాటి నుంచి ఇంతవరకు మండలంలో పేదలకు భూములు పంచుదామంటే ఇప్పటివరకు వివరాలు ఇవ్వకుండా తమాషా చూస్తున్నారంటూ ఆగ్రహంతో ఊగిపోయారు. తక్షణం ఆ భూముల వివరాలు తనకు తెలియజేయాలని దీనిపై సహించేది లేదన్నారు. ఎమ్మెల్యే ఆగ్రహంతో అధికారులు మిన్నకుండిపోయినారు. తహశీల్దార్ భూమిని కాజేసిన సంగతి ఆర్‌డిఓకు తెలిసినా గమ్మునుండడం విమర్శలకు తావిస్తోంది. ఆ అధికారిణి హయాంలోనే అవకతవకలు జరిగినట్లు పలువురు ఆరోపిస్తున్నారు. ఈ వ్యవహారమై జిల్లా కలెక్టర్ జోక్యం చేసుకొని విచారణ జరిపిస్తే మరిన్ని అక్రమాలు బయటపడతాయని, పేదలకు న్యాయం జరుగుతుందని మండల ప్రజలు కోరుకుంటున్నారు.

# రామ, రావణ చారిత్రక నేపథ్యం, అద్భుత చిత్రీకరణం!

కాల్పనిక సాహిత్యంలో 'నవలారచన' కల్పనా చాతుర్యానికి సంబంధించినది. అందువల్ల సాంఘికాలు ఓపికను బట్టి ఎన్నైనా రాయవచ్చు. అదే చారిత్రకమో, పౌరాణికమో అయినపుడు కలం దూకుడు వేగం తగ్గిపోతుంది. అందులోనూ చరిత్రను పట్టించుకోకుండా చారిత్రక నవలలు వ్రాయడం వేరు. చరిత్రను ఉల్లేఖిస్తూ చారిత్రక నేపథ్యాన్ని తూచ తప్పకుండా రాయడం వేరు. రెండవ నేపథ్యమే కష్ట సాధ్యమైనదీ, అలవిగానిదీనూ. శ్రీనివాసపురం సోదరుల 'విజయనగర నవలా మాలిక'(చిత్తూరు జిల్లా పుంగనూరు వాసులు, కన్నడ నవలా మాలికను అద్భుతంగా తెలుగు నవలలుగా తీసుకవచ్చారు.) అడవి బాపిరాజు, గోన గన్నారెడ్డి వంటి నవలలు ఈ కోవకు చెందినవి. అయితే ఆర్య, అనార్య, ద్రావిడ జాతుల యుద్ధగాథ అయిన 'రామాయణ' నేపథ్యాన్ని నవలగా తీసుకు వచ్చిన గౌరవం హిందీలో ఆచార్య చతురసేన్ శాస్త్రికే దక్కింది. ఆయన ప్రాచీన వేదకాలానికి చెందిన రామ, రావణ చరిత్రను, నాగ, సభశ్వర, సిద్ధ, సాధ్య, కిన్నెర, దేవదాన, దైత్య చరిత్రల్ని 'వయం రక్షామః' నవలలో చక్కగా కథాకథన రీతిలో విశ్లేషించారు. ఆ హిందీ నవలను అపూర్వంగా, అనన్య సామాన్యంగా "పౌలస్త్య హృదయం - దాశరథి విజయం" నవలగా తీర్చిదిద్దారు శ్రీమతి శోభిరాల బాలాత్రిపుర సుందరి. వీరు విజయవాడ వాస్తవ్యులు, వీరు సత్యనారాయణ గారి ధర్మపత్ని. రచయిత్రి ఇంతకు క్రితం మహాకవి కాళిదాసు జీవిత కథను "ఆషాఢస్య ప్రధమ దివసే" నవలగా మలిచారు. వీరు హిందీ, సంస్కృత భాషలలో పాండిత్యం గడించారు. బహుముఖ ప్రజ్ఞాశాలి. ఆచార్య చతురసేన్ శాస్త్రి ప్రాచీన కాలానికి చెందిన వాఙ్మయ పరిశోధకులు. 450 కథలు, 32 నవలలు వారు వ్రాశారు. 'వైశాలీ నగర వధుం', ప్రస్తుతం నవల "వయం రక్షామః" వీరికి కీర్తి ప్రతిష్ఠల్ని తెస్తే శ్రీమతి శోభిరాల తెనుగు అనువాదంలో అతని ఖ్యాతిని దక్షిణ భారతదేశంలో కూడా పరివ్యాప్తి చేశారు. "వయం రక్షామః"లో ఉన్న అంతరార్థం ఏమిటంటే రావణుడు రాక్షస చక్రవర్తి! ప్రవృత్తి రీత్యా కైకసికి జన్మించి రాక్షసుడయ్యాడే తప్ప జాతి రీత్యా సద్బ్రాహ్మణుడు. విశ్వవసుని కుమారుడు సుమాలి రావణుని మాతామహుడు. రావణునిలో దైత్య ప్రవృత్తికి ప్రధాన కారకుడు! యక్షపతి కుబేరుడు రావణుని అగ్రజుడు. గంధమాదన పర్వతంపై అలకాపురిని కుబేరుడు నిర్మించుకుంటే పశ్చిమ అరేబియా సముద్ర ప్రాంతంలో త్రికూట పర్వతంపై రావణుడు కుబేరుడు నిర్మించిన లంకను ఆక్రమించుకొని విస్తృత పరిచాడు. పునఃర్నిర్మించాడు. ఇందుకు మయుని సహాయ సహకారాలు లభించాయి. ఈ నేపథ్యంలో రావణుని కాలానికి పది, పన్నెండు దేవ దానవ యుద్ధాలు జరిగాయి. రావణుడు ఒక నిర్ణీత నిర్ణయానికి వస్తాడు. అదేమిటంటే ఇక దేవదానవ యుద్ధాలు జరగడానికి వీల్లేదు. అందువల్ల భారతదేశం మరియు దాని సరిహద్దు లంకల్ని 'రాక్షస మతం' తీసుకొనేలా చేయాలి. దానివల్ల దేవ మతం నశించి రాక్షస మతం సుస్థిరమౌతుంది. ఈ సంస్కృతి కోసమే రావణుడు దేశ, విదేశాలపై నరమేధం సృష్టిస్తాడు. అయితే విధి బలీయమయింది కదా. ఆర్యరాజైన రాముడి చేతిలో పరాజయమూ, మృత్యువునూ చవి చూస్తాడు. ఇది స్థూలంగా కథ. ఈ నవలలో దేవ, దానవ దైత్య, నాగ, కింపురుష, యక్ష జాతుల ప్రస్తావనలున్నాయి. నిజానికి వీరంతా కశ్యప ప్రజాపతికి వివిధ జాతుల భార్యల వల్ల కలిగిన సంతానం. చారిత్రకమైన వ్యక్తుల పేర్లు, స్థల నామాలు, ఉత్తర, దక్షిణ భారతంలోని చారిత్రక కథనాలు, మహిష్మతీపురాధీశుడు, హైహియ రాజవంశీకుడు, కార్త వీర్యార్జునుడు, కిష్కిందాధిపతి 'వాలి' చేతిలో రావణుడు పరాజయం చెందిన అంశాల్ని ఈ నవలలో రచయిత్రి వెల్లడించారు. కుబేరుడి అనుచరుడైన తుంబురుడు, గంధర్వుడ్ని, కుబేరుడు పరిత్యజించగా అతను విరాధుడి పేర దండకారణ్యంలో నివసించేవాడని, రామలక్ష్మణులకు రావణుని లంకను గురించి, వాలి సుగ్రీవుల గురించి వివరాలందించాడని రచయిత్రి ప్రస్తావించారు.

**పాఠకులకు తెలియని కొత్త అంశాలు**

రావణ వధానంతరం శ్రీరామ పట్టాభిషేకం వరకు మనకు తెలుసు. ఆ తర్వాత తులసీ రామాయణం, ఉత్తర రామాయణాల వల్ల రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నుల పాలనా కేంద్రాలు, వారి పిల్లల రాజ్యాలను గురించి తెలుస్తున్నది. మధురాధిపతి లవణుని సంహరించి లక్ష్మణుడు ఆక్రమించుకొంటాడు. వింధ్యకు దక్షిణంలోని 'కుశస్థలి' కుశావతి నగరాన్ని కుశుడు ఏలుతాడు. 'శ్రావస్తి' రాజధానిగా ఉత్తర కోసలను 'లవుడు' పరిపాలిస్తాడు. లక్ష్మణ కుమారులు, అంగద, చంద్రకాంతులు హిమాలయాల్లోని అంగద నగర, చంద్రావతీ నగరాల్ని పాలించారు. తక్షకుని నాగ పుత్రి 'కుముద్వతి'ని కుశుడు వివాహమాడుతాడు. ఈ విధమైన అంశాలు, లవుడి మనుమడు ధృవసంధువు విషయమూ, చివరగా లక్ష్మణ, శత్రుఘ్నుల పుత్రరాజ్యాలు నశించగా 'లవుని' వంశమే కొంతకాలం కొనసాగిందన్న అంశమూ నవలలో ప్రస్తావించబడింది. రచయిత్రికి మూలాల్ని మించి ఏ విషయమూ రాసే స్వేచ్ఛలేదు కాబట్టి ఆమె నవలను యధాతథంగా పాఠకులకందించింది. ఆమె అనువాదం సరళం. మేధావి రచయిత్రి కాబట్టి అంశాల్ని అర్థవంతంగా విపులీకరించింది. అయితే 'చతుర్సేన్' రచనలో కొంత అతిశయోక్తులున్నాయి. ఆఫ్రికా ఖండ ప్రస్తావన వాటిలో ఒకటి. రావణుని లంక విషయంలో అతను సూటిగా నిర్ణయాన్ని ప్రకటించలేదు. సీతాపహరణం మహారాష్ట్ర గోదావరి పరిసర ప్రాంతాలలో జరిగింది. ఇది ప్రస్తుతం 'నాసిక్'కు సమీపం. అక్కడి నుంచి వారు కర్ణాటక దిశగా ప్రయాణించారు. విరాధుడు, సంపాతి రావణ, వాలి, సుగ్రీవుల వివరాలందిస్తే గోదావరికి పశ్చిమంలోని మతంగాశ్రమంలోని శబరి ఆ విషయాల్ని ధృవపరచింది. రామలక్ష్మణులు తుంగభద్ర ప్రాంతానికి వచ్చి కంపిలి, కుంజర కోన, హంపి ప్రాంతాలలో సుగ్రీవ హనుమంతుల్ని కలిసి, వాలిని వధించి సుగ్రీవ సేనతోనూ అయోధ్య, ఇతర మిత్ర దేశాలైన అంగ, వంగ, మత్స్య, శృంగభేరీపుర, కాశీ, సౌవీర, సౌరాష్ట్ర, కిష్కింధ సైన్యాలతో కర్ణాటక సముద్ర ప్రాంతంలో ఉన్న లంకపై దాడి చేశారన్నది నా అభిప్రాయం. అంటే నేటి శ్రీలంక రావణుని లంక కాదన్నది ఒక భావన. ఈ నేపథ్యంలో మున్యాశ్రమాలు, రాముడి ఆయుధాలు లభించాయి. రావణుని జన్మస్థలం కూడా ఉత్తరప్రదేశ్‌లోని 'నోయిడా' అని నాసా(అమెరికా అంతరిక్ష సంస్థ) ఇటీవల నిర్ధారించింది. ఇందువల్ల అయోధ్యకు, మిథిలకు, రావణుడికి మధ్య ముందు నుంచే విభేదాలున్నాయి. సీతాస్వయంవరానికి రావణుడు కూడా హాజరు కావడం ఒక కారణం. సహజంగా రావణుడు 'స్త్రీ' కాముకుడు. ఆచార్య చతురసేన్ తన నవలలో ఆ విషయాల్ని నిరూపించారు కూడా. ఆర్య, అనార్య, ఆస్ట్రలాయిడ్ జాతులకు ఆది నుంచీ విరోధాలున్నాయి. ఈ కారణంగానే ఆర్యులకు శత్రువులైన అనార్యులకు(రావణాదులు) వ్యతిరేకంగా ఆస్ట్రలాయిడ్‌లు(శబరమాతలు) పుళింద, గరుడ, నాగ, యక్షులు) శబరి, సంపాతి, జటాయువు, గుహుడు, విరాధుడు సహకరించి రావణ వధకు కారకులైనారు. విభీషణుడి రాజ్యకాంక్ష కూడా రావణునికి దురదృష్టంగా పరిణమించింది. ఈ అంశాలన్నింటినీ తర్కించాలంటే భారతదేశంలో స్థానికులు ఆస్ట్రలాయిడ్‌లని, ద్రావిడులు, ఆర్యులు పై ప్రాంతాల నుంచి వలస వచ్చి స్థిరపడిన వారని చెప్పాల్సి వస్తుంది. చతురసేన్ లక్ష్యం నవలే గనుక తను మిక్కిలి చారిత్రక విషయాల జోలికి పోలేదనిపిస్తుంది. ఏదిఏమైనా చతురసేన్ శాస్త్రి ప్రయత్నం అద్భుతం. 'వయం రక్షామః' హిందీ నవలని తెలుగు వారికి పరిచయం చేసిన రచయిత్రి పూనిక ఇంకా గొప్పది. చతురసేన్ లాంటి తెలుగేతర రచయితల పుస్తకాలు ఇంకా అనేకం ఉన్నాయి. ఇతర భాషల పుస్తకాల్ని ఈ విధంగా తర్జుమా చేసుకోవడం వల్ల ఒకరి సాహిత్యం, తద్వారా సంస్కృతి, ఒకరి అర్థం, అవగాహనా అవుతాయి. భారతీయతకు ఈ లక్ష్యం, లక్షణం అవసరం కూడా!

**వయం రక్షామః**
(హిందీ నవల)
**పౌలస్త్య హృదయం దాశరథి విజయం'**
(తెనుగు నవల)
తెనుగు సేత : **శోభిరాల బాలాత్రిపుర సుందరి**
విశ్లేషకులు : **పాయసం సుబ్రహ్మణ్య మహర్షి**
పుటలు : **260** ధర : **120/-**
**ప్రతులకు**
రచయిత్రి, అలంకృత అపార్ట్‌మెంట్
పడమట లంక, విజయవాడ - 4

